# శ్రీ శ్రీనివాస చరిత్రము



రచన :

జాగర్లమూడి వెంకటకృష్ణశర్మ

ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానముల ఆర్థిక సహాయంతో

ముద్రింపబడినది.

1988

# శ్రీ శ్రీనివాస చరిత్రము



రచన :

జాగర్లమూడి వెంకటకృష్ణశర్మ

ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానముల ఆర్థిక సహాయంతో

ముద్రింపబడినది.

1988

శ్రీ శ్రీనివాసచరిత్రము



రచన : జాగర్లమూడి వెంకటకృష్ణశర్మ

ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయముతో ప్రచురించబడినది.



ప్రతులు : 1000

ముద్రితము :
రాజా ప్రింటర్స్, తిరుపతి.



హరికథా గాన మధుర సరస భావసుధా ధురీణ

సువర్ణ పతక ఘంటాకంకణ బిరుదాంకితులైన

## జాగర్లమూడి వెంకటకృష్ణశర్మ భాగవతార్

18-4-111, రైల్వేకాలనీ, తిరుపతి, చిత్తూరు జిల్లా.

# అభిప్రాయం

శ్రీ శ్రీనివాస చరిత్రమును పురాణ హారికథా రూపముగా పలువురు భక్తులు ఉపయోగించు కొనుటకు వీలుగా శ్రీ జాగర్లమూడి వెంకటకృష్ణశర్మ వ్రాసిన చరిత్ర చదివి పరిశీలించినాను. ప్రజలకు భక్త శ్రోతలకు అనుకూలముగా అర్థమగునట్లు వచనము, పాటలు, పద్యములు కలపి, భక్తి రక్తి ఏక దృష్టితో ముక్తిమార్గములను తెలియ వ్రాసిన జె. వి కె. శర్మగారికి నా అభినందనములు.

ఇట్లు
పండిత అగ్రజ సత్యనారాయణశాస్త్రి
టి. టి. డి పురాణ పండితులు, తిరుపతి.

సృష్టి జీవులనెల్ల విచిత్రములుగ
చిత్రనాటక మాడించు సంతసించు
ఆది అంత్యము లెవ్వియున్ నెఱుగరాని
విశ్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుండు.

శ్రీ జాగర్లమూడి వెంకటకృష్ణశర్మగారు రచించిన శ్రీ శ్రీనివాసుచరిత్రము ఆమూలాగ్రంగా చదివినాను. ఇందలి వచన పద్యములు భక్తిభావములు కలిగి సకల భక్తజనులకు అర్థమగులాగున వ్రాసినారు. యిట్టి సద్గ్రంథము సర్వజనానుమోదమందునని నా అభిప్రాయము. ఇట్టి గ్రంథము వ్రాసిన రచయితకు ఆర్థికసహాయమొనర్చిన తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి నా ధన్యవాదములు.

ఇట్లు
ఆర్. రాఘవరావు
డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, కడప.

---

# విషయసూచిక

—(౦)—

# ఇష్టదేవత ప్రార్ధనము

తే: గీ: శ్రీగణేశ విఘ్నేశ్వర శివకుమార
గజముఖాంభోజ నన్నేలు కరుణతోడ
పార్వతీముఖ పద్మార్క పాపనాశ
సర్వ విద్యాధినాయక శరణు శరణు ॥

ఉ॥ శారద నాదు జిహ్వపై, చయ్యన నిల్చి సమస్త పండితా
వాదములెల్ల సతతము వాక్పటిమన్ ప్రసరింజేసి, సు
క్షేత్రుడు వేంకటేశరక్షా మణిపుణ్యచరిత్ర వ్రాసితిన్
నేరనివాడ నేద్దియును నీదయతో దోసము బాపుభారతీ ॥

గీ॥ సత్యలోక చతుర్ముఖ ప్రియతరాణి
విశ్వసుకజన వాక్సుధా వీణపాణి
లచ్చికోడల స్వేతకమలాక్షివాణి
శ్రీనివాస్ చరిత్ర వ్రాస్తి నీ శక్తిబూని ॥

ఉ: శ్రీవరవెంకటేశ్వర విశేషగుణాఢ్య దయాపయోనిధీ
భూవరకౌస్తుభాఖ్యమణి భూషణ కేశవపూరుషోత్తమా
పావననామ భక్తజన పాలకదామ వికుంఠధామ నా
భావనలందునిల్చి జయభాగ్యములిచ్చి సతంబు బ్రోవుమా.

శ్రీనివాస సర్వేశ్వర చిద్విలాస
పాపనాశ దామోదర భక్తపోష
సగుణమూర్తిత్రయాత్మక సర్వసాక్షి
వినుత జనలోక సంహార వేంకటేశా ॥

వరద పద్మావతీనాథ వాసుదేవ
బీబినాంచారు మానస ప్రియనివాస
పాహి అలమేలు మంగేశ భక్తసులభ
విజయతే శ్రీశకల్యాణ వేంకటేశ ॥

వందనము నీకు జగదీశ భక్తపోష
వందనము నీకు లక్ష్మీశ పాపనాశ
వందనము నీకు సుందరబృందవేష
విజయతే శ్రీశ కళ్యాణ వేంకటేశ ॥

గీ॥ పండితుడ కవినిగానేతి ప్రాసలెరుగ
భక్తి ముక్తికి శ్రీ శ్రీనివాసుచరిత
వ్రాసితిన్ దప్పువిడచి మన్నించి చదువ
పండిత మహాకవీశ్వర ప్రముఖులారా ॥

శ్రీలక్ష్మీ వేంకటేశ్వర ప్రసన్నః

# శ్రీ శ్రీనివాస చరిత్రము

క॥ తిరుపతి వెంకటరమణా మురహర మృదుచరణా యుగళ ము_క్తిని నిమ్మా
కరివరదుడవని నిను మది స్మరియించియు కృతిని నిడితి సన్మని వినుతా॥

ఉ॥ కరముల శంఖచక్రము లఖండయురమ్మున లక్ష్మీదేవి సం
బరముగ ధరణిదేవియు నపార విభూషణ తారహారసం
భరిత సహస్రకోటిప్రభ స్ఫుర తేజితకోటిమన్మథా
సురనుత భక్తసప్తగిరి శోభితపాలక శ్రీనివాసకా॥

తోహార

శ్రీమంతంబగు భారతదేశమ్మున నైమిశారణ్యమనగా
తాపసవరులకు కడుపవిత్రమై ధర నలరారెడుగనగా

చం॥ సకల తపః ప్రభావరుషి శౌచక్షమాదిక దేవసంచయా
స్పిక శుకశారికా మధుర భృంగమయూర సుమాంచల ప్రభా
వికసిత రుక్సుధా ప్రణవ వేదస్ఫుటచ్ఛయ యజ్ఞవాటికా
ప్రకటప్రభాస నైమిశ యరణ్యాము పుణ్యఫలప్రగణ్యామౌ ॥

సీ॥ సారంగ సంచయ సారంగ సంభ్రమ
సారంగ సంభోగ సారవనము
సారంగ వికసిత సార చకోరికా
సారంగ దుత్తుంగ చంపకమ్ము
సారంగ రసమధు సారంగయానంగ
సారంగ సాగర సంభృతమ్ము
సారంగ సాయుధ సారంగ వర్షికా
సారంగ కాసార చామరమ్ము

గీ॥ సరససంబావ సారంగ స్థావరమ్ము
సకల సౌఖ్యతపఃఫల సార్థకమ్ము
స్వర్గఫల నైమిశారణ్య సత్పదమ్ము
శాస్త్రవర్ణిత బూచిత స్థానకమ్ము.

వ॥ శుకశౌనకాది మహామునులందరూ అక్కడనే నివశించి తపస్సు చేసుకుంటూ వుండేవారు. వ్యాసమహాముని వ్రాసిన పదునెన్మిది పురాణాలు సూతునివల్ల శౌనకుడు మొదలైన మునీశ్వరులు విన్నారు. ఆ పురాణాలు వినే సమయంలో ఒకానొకప్పుడు శౌనకాదులు సూతమునీశ్వరుణ్ణి వేంకటేశ్వరు అవతార మహిమ చెప్పగోరినారు.

తోహరా

శుకశౌనక జాబాలి మునులెల్ల సూతమునీంద్రుని జూచీ
వేంకటాచల మహత్యమమృతా ఒక క్రమము విన్పించీ
సంకటహరుని వేంకట రమణుని సకలలీల వర్ణించీ
నికమాజన్మ తరింప జేయవే యన సూతుడుకరుణించీ.

గీ॥ శ్రీనివాసుని చరితమ్ము శ్రీయుతమ్ము
కలుగు కలికల్మషంబులు దొలగువిన్న
కలియుగంబున వైకుంఠ నిలయమైన
వేంకటాద్రీశు చరితంబు వేడ్క వినుడీ॥

వ॥ అని సూతమునీంద్రుడిట్లు చెప్పదొడగే

సీ॥ కృతయుగదనుజులన్ శ్వేతవరాహమై
నరసింహమ్మరూపుడై ధరసుగూల్చె
ధర త్రేతయుగమునన్ దశకంఠ దనుజులన్
రఘురాముడై పరశురామునొంచె
వసుదద్వాపరమున వసుదేవ పుత్రుడై
శిశుపాల కంస రాక్షసుల గూల్చె
మత్స్యమ్మై సోమకున్ మర్ధించికూర్మమై
మందరంబెత్తి నమృతంబు బంచె.

గీ॥ శిరియై వామనుండై. శ్రీసుకమ్ము
బుద్ధుడై కవిరూపుడై. భువినినిల్చి
శ్రీని విడి వేకంటాద్రిపైన. శ్రీనివాసు.
డమరమర్త్యుల గాపాడ నవతరించె ॥

వ॥ నా య న లా రా ప్రపంచములో, మానవులందరిని తరింప చేయుటకు శ్రీమహావిష్ణువు శ్రీవేంకటాచలముపై అవతరించాడు. ఆ వేంక టేశ్వరుడు కలియుగ ప్రత్యక్షదైవము భక్తుల కేబాధలు కలుగకుండా. కంటికి రెప్పవలె కాపాడుచుండును, మీరు కోరిన ఈ దివ్యచరిత్ర పవిత్రమైనది ఇది విన్నవారికి మోక్షము సులభముగాలభించి జన్మరాహిత్యమగును. పరమభక్తులైన మీరందరూ భక్తివినకోరిన. కథావిధానము చెప్పెదవినుడని గురుండగు వ్యాసుని దలంచి సూతమహారుషిట్లు చెప్పదొడంగెను.

తోహర

నారాయణ పదసేవతత్పరుడు నారదముని యొకనాడు
మర్త్యదుర్మోహ దుర్భరదారుణ. కృత్యజనులగని నాడు
మృత్యుగహ్వరంబుల బడునీచుల మూర్ఖభావముల నూడ్చి
సత్యధర్మములనిల్పి గాపాడు నదుపాయము యోచించి.

గీ॥ నారదుడు లోకసంచార మరల కొంత
యోచనన్ చేసి కలహారి యుర్విలోన
దుష్టశిక్షణమును శిష్ట రక్షణంబు
సేయదలచియు బ్రహ్మను జేరనేగె ॥

పాట——అది

జయజయ శారదనాథా జయజయ కమలోద్భవ జీవనాథ
ప॥ సత్యలోక సంధానసాధు జన
శాంత స్వభావా చతుర్ముఖ దేవ ॥జయ॥
అ॥ మారజనక సుతమంజుల భాషా
సత్యలోక జన పాలిత వాసా॥

మాధవభక్త జనావన దోషా
పరిహారిత సుజనాత్మక పోషా॥ జ॥

వ॥ నారదముని భక్తరక్షణకును దుష్టశిక్షణకును
శ్రీ మన్నారాయణ మూర్తికండగాయుండి చిని చిన్ని
కలహాలు కల్పించి ఆనందించుచుండును గాన
పద్మఆసనశీనుడైన బ్రహ్మదేవు నమస్కరించి.

తోహార

వీణ మీటుచున్ స్వరయుక్తమ్మగ గానముచేసె సరస్వతీ
ఘనదిక్పాలకు లింద్ర సూర్యనవగ్రహ సప్తరుషీంద్రాది
దేవగణమెల్ల సంతోషమ్మున దేవిగానమును వినగా
దేవరుషి బ్రహ్మమానస పుత్రుడు దేవత లెల్లరుగనగా.

వ॥ తంత్రీ చతురాననా నీవాట పాటగా నానందముల
తో హాయిగా నుంటిరే కాని లోక జీవులగతిగాన రై తిరి.

ఉ॥ శ్రీశుడు ద్వాపరాంతమున జేరెవికుంతముగాని భూస్థలిన్
మోసమధర్మమశ్చరిత మూర్ఖ స్వలాభితకాంక్షకాముకై
దోష కలి ప్రవేశమున దుర్భరదుస్సహ ఘోరపాపులై
ఈశునినామసంస్మరణ నీసముగొల్వక నాశమందెడిన్.

ఖండగతి

కలిమాయలన్ బడియు కలియుగమునన్జనులు
తలితంత్రిగురుదైవముల భక్తిశూన్యులై ॥క॥
కులమతాచార ముల్పలహ విర్భాగముల్
నిలపాపభీతి విడి చెలగె శీలమువీడ ॥క॥

అ॥ తులువతనంబున నిహపరముల రెండిట్నన్ జడి కడు
కలని నరకంబునబడి నిల్వని గ్రాగుచు నుండిరి ॥క॥

సీ॥ స్నానసంధుష్టాను సత్కర్మలన్ మాని
చెడుమార్గములజేరి జచ్చువారు

వావివరుసఁ లేక అవనీతి వర్తించి
స్వల్ప ఆయుష్యులై జచ్చువారు
బాలురై తమ కిన్నతల్లులబోలు స్త్రీ
వయసు బాటింపక ప్రమందువారు
కులటలై బాలురన్ గూడి బాపమనక
గూఢ పతి భక్తిచే గూడువారు

గీ॥ అతివినయ పూర్తలక్షణ ప్రీతిజూపి
పతితలై జారులై పాపభీతిలేక
తేనెబూసిన కత్తులై దిరిగి పాప
కూపములగుండె కలిజనోద్భవము తండ్రీ.

గీ॥ దండధరు శాసనంబుల బండబారి
తల్లడిలు జనుల పాపముల్ దొలగజేయు
మార్గమును గలుగవలెనన్న మారజనకు
డవతరింపక దొలగదీ యవని బాధ.

వ॥ అని వినుతింప బ్రహ్మ నారదుని చూచి సత్కరించి నారదా నీవు గొప్ప భక్తుడవు గాన నీవక మహాకార్యం చేసి లోకోపకారముగావించి పుణ్యము గట్టుకొనుము.

మంజరి

కలియుగమున విష్ణుని యవతారము కలుగని కారణముననూ
కలిమానవులిటు మూర్ఖపాపులై ఘన నరకమున బడియెను
గాన నీ నేర్పుచేత విష్ణు శీఘ్రముగ భూలోకమునకు
తన యవతారము నిల్ప శ్రేయమగు ధన్యమగు లోకములకు.

వ॥ నీనేర్పుతో నెటులైనా విష్ణుమూర్తి భూలోకములో అవతారమెత్తునట్లు చేసిన అప్పుడు మానవులు దైవభక్తిగలిగి తరింతురు. లోకకల్యాణంబు కలుగుతులదని నీవీ కార్యముచేసిన నీకు కీర్తికలుగునన, ఆమాటలు విని సభలోని వారందరు బ్రహ్మదేవుని ఆలోచనకు ఆనందించి నారదుని ప్రోత్సహించిరి.

అపుడు నారదముని తండ్రి జెప్పినట్లు.

గీ॥ ఔర లోకోపకారమున కెట్టిదైన
తగు నుపాయంబు చేతనా తాత హరిని
ధరణి జేర్చెద పాపముల్ దరగిపోవ
జనులు స్మరియింత్రు దర్శింత్రు జని తరింత్రు ॥

క॥ అన విని బ్రహ్మయు నారద గనుగొని శ్రీఘంటి
భువిని కలుషమడంపన్
ఘనుడుదయించు నుపాయంబును జేయగ
నీవే తగుదు పృథివి కుమారా.

దోహర

అనిన బ్రహ్మ యనుమతిని గొనివేగ
అతి పవిత్రమౌ ధరణిన్
జాహ్నవీ తీరము జేరిగాంచె
సాధుత పోధన వనినిన్.

వ॥ నారదమునికి తండ్రి చెప్పిన ఆలోచన మంచిగానే తోచింది. లోకానికి మేలు చేయాలని నిశ్చయించాడు. హరినామస్మరణ చేస్తూ బయలు దేరాడు.

పాట

దేవదేవ పురుషోత్తమ కేశవ
దీనజనావన శౌరీ నను బ్రోవుము మురవైరీ

అ॥ ఎన్నడైన నీనామము మరువను
పన్నగ శయనా నన్నెటు గాతువో ॥దే॥
ఫాలనేత్ర చతురానన పూజిత
పాలజలజ వసుదేవ తనూజా
అల్లపురీశ్వర రామదాస తనుజ
పల్లవాధరా పరిపాలయమత ॥దే॥

ప॥ దానవహరణ నీదాసులకును నేదాసుడ
నిదిమొదలా నీమౌనము నిక వదలూ.

అ॥ పరమపురుష పరమాత్మ పరాత్పర
కరివరదా హరి కరుణ విదారి
వ్యాస పరాత్పర పుండరీక శుక
దానపోషకాలోల జగత్పతే ॥దే॥

ప॥ మాయకి సుతధన దారాదికములు
మాధవ నీపద ధ్యానమే సేయుర

(అ॥వ) వలదు జన్మమిక వలదు నాకహో
వాసుదేవ శ్రీకృష్ణ జనార్ధన
సనకస నందన సనత్కుమారా
చెంతచేరితిని పంతగింపకుము ॥దే॥

వ॥ ఇలా నారదముని వీణమీటుచూ నారాయణుని పాటబాడుచు నాట్యము
ిచు.

గీ॥ పుణ్యఫల పుష్పతరుశోభ యగ్న్యవనము
శాశ్వితానంద మోక్ష తపోదనమ్ము
జాహ్నవీపుణ్య తీర్థమ్ము జపతపమ్ము
యగ్న్యఫలవాటికమ్ముబౌ అమరతలము.

మంజరి

సుందరయుతమగు సునిసిత సుమలత
శుకపికశారిక నాద సుశోభిత
కుసుమిత ఫలయుత కూకూ రవళిత
ఝుంఝూ మారుత ఝూంకారమ్ములు
ఒలఒల ప్రావెడు పూల వర్షముల్.

వ॥ అనేక జాతి పుష్పపరిమళ వాయులతా లలిత మలయమారుత కుసుమ
తమైన గంగానది యొడ్డునజేరి నచట.

సీ॥ విష్ణు పాదమ్ముల నావిర్భవించిన
లోక పావని గంగా భవాని దేవి
నటరాజ విషతాప మటుమాయగావించి
మేటి సిరజటి మెక్కు గాపేటిమిన్న
ధీరభగీరథుని తపః ఫలంబున
పితృ పితామహుం పవిత్ర జేరిచ
పాపంబులను పటాపంచలు గావించి
భక్తజనులగాచు పవిత్రమూర్తి

గీ॥ దేవగంధర్వ మానవ తీర్థగంగ
జలచరాజీవిత విహంగ పాలగంగ
జపతపస్స్వాధు సంచయ శాంతగంగ
యజ్ఞఫలమోక్షభాగ్య సస్యాఘగంగ

మంజరి

జేరకశ్యపవశిష్ట శుకశౌనకార్య
భృగూత్తమ రుషులు
పరివేష్టించియు యజ్ఞ్యమొనరించు
తరి నారదుగని మునులు
అర్ఘ్యపాద్యాది విధుల పూజింప
నమరముని సంతసింపా
అనఘులార నీయజ్ఞ్యఫలభో క్త
నేవేల్పని ప్రశ్నింపా॥

వ॥ అట్టి పవిత్ర గంగయొడ్డున సకలలోక క్షేమమును గూర్చి మహా తప స్సంపన్నులగు మహరుషులు చేరి సర్వజనో సుఖినో భవంతు. అని సకలదోష నివారణ శాంతియుతమైన, నొక మహాయజ్ఞ్యము చేయ సంకల్పించునంతలో దేవ ముని నారదుడటచేర రుషులర్ఘ్యపాద్యాదుల నర్పించి గౌరవింప నారదమునిలేచి ఓమ గానుబావులారా మీలో వక్కొక్కరు వక్కొక్కలోకం సృష్టింపగల

సమర్థులు మీరు మహాభక్తితో చేయుచున్న యీ యజ్ఞ్యమునకు నేనెంతయో ఆనందించుచున్నాను. కాని నాకొక సందేహం కల్గినది మీరు చేయుయజ్ఞ్యము ఏ దేవునిగూర్చియో యీయజ్ఞ్యమునకు ఫలమిచ్చుదేవుడు త్రిమూర్తులలో ఎవ్వరో నేతెలియక తికమక పడుచున్నాను మహానుభావులు మీరు నా సందేహం తీర్చి పుణ్యముకట్టుకొనుడన త్రిమూర్తులలో నెవరిపేరు చెప్పుటకు తోచకమిన్నకున్నారు

గీ॥ ఎనగ నిశ్చేష్టులై మునుల్ నెరుక బడక
జూచునెడ నారదుడును యోచించి పల్కె
అర్థమును లేని యజ్ఞ్యము వ్యర్థమగును
శ్రద్ధవహియించి యోంచించి జేయుడయ్య

గీ॥ సత్యగుణ ప్రధానుండు శాంతచిత్తు
సజ్జనుడు త్రిమూర్తులందెవడో సత్వరంబు
తెలిసుకొని రండు మీరలో తపసులార
లోకకల్యాణ మగునింక కాగదేలా

వ॥ శాంత శమదాది గుణ మోక్షప్రదమిచ్చు సత్వగుణ ప్రధానుదెవ్వరో అట్టి దేవదేవు నెరింగి యజ్ఞ్యఫలము దారపోసిన పుణ్యఫల మబ్బు.

తోహర

బ్రహ్మలోక కైలాస వైకుంఠ పట్టణంబులజేరీ
త్రిమూర్తుల గుణము గ్రహింపగల్గిన ధీరులెవ్వరని యనిరీ
భూతభవిష్యద్వర్తమాన ఘన భూరిత పోజ్యలయుతుడు
భృగు మునీంద్రుదే తగునీ పనికని బల్కెజనె కలహరతుడు.

వ॥ మూడులోకాలజేరి త్రిమూర్తుల గుణముల గ్రహించి నిర్ణయింపగల సమర్థుం డెవడున్నాడాయని ఆలోచించుచుండ నారదుండో ఋషులారా మీలో మహాతపోనిధియై అరికాలిలోనే నేత్రముండిన మహాన్వితుడగు భృగుమహాముని యుండగా విచారింపనేల యా తపస్విని బంపి కార్యము సాధింపుడన ఋషులెల్ల భృగుమునిన్ వేడ.

గీ॥ నరసి ఋషిపుంగవుఁడు భృగుమునీంద్రుతోడ
సత్వగుణపూర్ణుఁడెవరో త్రిమూర్తులందు
నరసివచ్చి సపర్యుండ ననఘుఁడీవె
తగుదువన తపో మహిమచే భృగుఁడునేగె॥

వ॥ సత్వగుణము, రజోగుణము, తమోగుణము ఈ మూడింటిలో సత్వగుణ ప్రధానమైనదే భగవత్స్వరూపము గాన. త్రిమూర్తుల పరీక్షించుట సామాన్యమైన పనిగాదు. ఈ పరీక్షకందరు భయపడుచున్నారు. త్రిమూర్తుల పరీక్ష అగ్నితో చలగాటము వంటిదని సందేహించాడు. గాని అందరుకోరుటచేత భృగుప్రయాణమును నిశ్చయించాడు.

( భృగుముని బ్రహ్మలోకము పోవుట )

సీ॥ బ్రహ్మదేవుడు నిండు సభలోన బంగరు
కమలాసనంబున గనుచునుండ
బ్రహ్మదేవరుషులు రాజమహారుషులు
గరుడ గంధర్వ కిన్నెరులు యక్ష
లాదిగా సురసిద్ధులందరగని బ్రహ్మ
వేదధర్మంబుల బోధసేయ
ఆనందమందుచు నందరు వినుచుండ
సభలోన భృగుముని సరగనేగి

గీ॥ గర్వమున నలువకైన నమస్కారమనక
గద్దెపై కూరుచుండియు బుద్ధిలేక
నంత నిర్లక్ష్యమును జూచి నాగ్రహించి
నలువ గద్దించి భృగువైపు నట్టెజూచి

వ॥ బ్రహ్మదేవుడు మహారుషులు దేవరుషులు రాజరుషులు బ్రహ్మరుషులు ఒకవైపు, సురులు యక్షులు గరుడ గంధర్వ కిన్నెరులు కూర్చొనియుండ వేదధర్మాలు బ్రహ్మ బోధించుచుండ అందరు ఆనందించుచూ వినుచుండ ఆ సమయమున భృగుముని నిర్లక్ష్యముగా బ్రహ్మదేవుని నమస్కరింపక గద్దె నెక్కినారి నలువ చూచి

అంబికార్ధదేహ వృషవాహ
గంభీర ఖాలగరళకం ధరా ॥శం॥

బాలచంద్రధర గంగా జటాధర
నీలకంఠ ధరా నాగభూషహర
ఫాల నేత్రఘన జటా ధరావర
పాలభక్త జనపూజిత విహార ॥శం॥

వ॥ బ్రహ్మ దేవుని సంగతి తెలిసినది నిక ఈశ్వరుని సంగతి తెలుసు కొనెదనని భృగుమహాముని కైలాసముచేర నందీశ్వర భృంగీశ్వర చండీశ్వర విఘ్నేశ్వర మొదలగు ప్రమధ గణములు అంతా శివ పంచాక్షరీ జపధ్యాన నిమగ్నులై ప్రణవనాద జపపులకిత శరీరులై ఆడిపాడుచుండ భృగుమహాముని కైలాసవాసుడగు పరమేశ్వరుని ధ్యానించె.

సీ॥ ముక్కంటి పండుల మెక్కువానికి చంద్రి
పై వెండి కొండపై నలరువాడ
గట్టి రాపట్టి కేల్పట్టి బాలకపైన
ముద్రో వద్రిమ్మరిగ దిరుగువాడ
పైకంటి మంటలోపల సుమువీటి ర
క్కసుల ఖాదేయార్చి గ్రాలువాడ
నెత్తిపై చిన్నిక్రొన్నెల పువ్వువెలయంగ
బాపజుత్తులతోడ బరగువాడ

గీ॥ ఇసము కుత్తుకబట్టుక వెలయువాడ
ఇమ్ముగా పుత్రెబిచ్చము నెత్తువాడ
మిత్తులకు నెల్ల మిత్తియై మెలగువాడ
నిండు దయజూడు నను వెండికొండరేడా.

వ॥ కావలి వారిజేరి శివుడేమిచేయు చున్నాడని అడుగ అయ్యా పరమేశ్వ రుడు పార్వతీ దేవితో ఏకాంతమందిరములో నున్నారని విని నాకిదేమంచి సమయ మని తలంచి మందిరమున జొచ్చి నుంతించెను.

చ॥ అని వినుతింప పార్వతియు నా నటకేశ్వరుడించు
కేనియున్ ముని భృగుజాతకే ప్రణయమోదము
తోడుక నాట్యమాడగన్
గనికడు నాగ్రహించి ముని ఘర్షనినాద భయోగ్ర
తాపసం జనిత శపించె లింగముని జెందును
పూజ్యత నేడి నర్తనా॥

వ॥ ఏకాంతాముగా నున్న ఆ పగల వద్ద నితరులుపోగూడదని తెలిసియు మూర్ఖుడుగా వచ్చిన భృగునిచూచి పార్వతీదేవి దూరందొలగ రుద్రుండది చూచి యుగ్రుడై చిందులు ద్రొక్కుచూ రౌద్రమూర్తియై ధిక్కరించి గద్దించి ఓరి మూర్ఖుడా పెద్దవాడవైనా మర్యాద లేక భార్య భర్తల ఏకాంత మందిరము చేరవచ్చునా నా ఆజ్ఞలేక లోని కేలవచ్చితివని బ్రహ్మ వంశానబుట్టి వేదధర్మములే చదివి నెరిగిన తపోధను డవునుకొంటిని గాని ఇంతమూర్ఖుడ వనుకొనలేదు నిన్ను శపించి నాశము చేతుగాని నీ అదృష్టముద విడచితినన భృగుడు కోపించి.

మంజరి

సతి లోపుండవు తమోగుణ నీకు
గతి లింగ పూజయంచూ
సతిగర్వాంధయు శక్తియైనీదు
నగ దేహ మాక్రమించూ
తగువిరాగికిన్ శాంత గుణంబును
తామస గుణుడని తెలసె
శుద్ధలింగమునే పూజింప బడెదు
శూలినీవు కడు తామసీ॥

వ॥ ఆదిదేవుడైన మహాత్ముని కెంత కోపమువచ్చె నితడు కడు తామసి గుణుండుగా దెలసె నేనింక నిందుండరాదు.

గీ॥ పార్వతీశుల కిటుల శాపంబొసంగి
శౌరి మానసమరయగా సాహసించి

పనియేమైయంత బ్రాహ్మణా మునివరుండు
శ్రీహరిన్ లక్ష్మితో సహా గాంచగానె॥

వ॥ వైకుంఠము అందమైన ప్రదేశము శ్రీలక్ష్మీదేవికి నివాస భవనము అంద చందములకు పుట్టినిల్లై కిన్నెర కింపురుష గంధర్వులు పాడుచుండగా శ్రీహరి శేషపాన్పుపై పవళించియుండ లక్ష్మీదేవి పాదసేవ చేయుచుండ భృగుమహర్షి గాంచెను.

శా॥ ఉల్లాసంబున విష్ణుదేవుడు సతిన్
యొయ్యారి సౌందర్యవసం
దల్లిన్ మన్ననఁ జేయుచు న్నాసాయుక పేరన్
దేవి యుయ్యంగా నిలన్
తల్పంబందున జేర్చి మోవిని సుధా ధారాపానము గ్రోలత
త్పుల్లాక్షిని కౌగిలించె నది నా భృగుపై జూచియున్

మంజరి

ఔరా కామాంధకారమై నిద్దురలయి యున్నైతవి దగునే
నారాయణుడవు నాదివిష్ణుడవు నామునసాక్షిక మునిన్
సిరిగూడుచు లజ్జాభిమానముల్ సిగ్గుమాలి కామినిన్
హరికాముడ నీవనర్హుడవింక హవిర్భాగపటువికిసిన్
గీ॥ అనుచు కోపించి గద్దించి విష్ణుదేవు
వక్షమున దన్నె వరలక్ష్మి వీక్షణాని
యాగ్రహింపగ మునిపాదయుగళ నేత్ర
మొక్క పరిహర్తై భృగుగర్వ ముక్కడింపా.

వ॥ భృగుమహారుషి స్వామినిచూచి అదురులేక నారాయణమూర్తి రొమ్ముపై ఎగిసి తన్నెను. లక్ష్మీదేవి నివ్వెరపడి చూచుచుండ తన్నుదిన్న భగవానుడు తామసపడక పాన్పునుండిలేచి క్రిందికి దిగి భృగుమహాముని పాద ములు పట్టుకొని ప్రశాంతంగా ఓహో నేను ఏడు ధన్యుడ నీవంటి తపోధనుల పాదధూళిచే నా శరీరము పవిత్రమైనది ఈనాడు నా మోక్షలక్ష్మికి ధన్యత గల్గినది.

పాట

ధన్యుడనైతిని తాపస చంద్రమ
మాన్యంబయ్యెను మామక జన్మము ।ధ।
పావనమగు మీ పాదాస్పర్శము
చే విమలాత్వము జెందెను నా శిరము ।ధ।
ఏగతి నొచ్చెనొ మీ మృదుపాదము
వేగమే నాదు కిరీటము తాకున ।ధ।

గీ॥ రత్నమయ కిరీటము భవత్పదమునకు దాక
యంతనొచ్చెను రవ్వంత నొత్తువాడ
తప్పు మన్నింపు నన్గటాక్షింపుస్వామి
నీదు అరికాలి నొక కన్ను జూతునేడు.

చ॥ పదములబట్టి దాసుడను ప్రార్థనజేతు క్షమింపుడంచు
నా ఎతివరువేడ లక్ష్మిగని యాగ్రహమంది దొలంగె క్రోధియై
మదమడగన్ భృగోత్తముని పాదమునందలి నేత్రమొత్తగా
అతి బలహీడై హరిస్తుతించె కరమ్ము మోడ్చి ఖిన్నుడై

వ॥ ఏది మీ పాదమని పాదములోని నేత్రమును చిదిపివేసి, మీరు మహానుభావులు మీ అభిప్రాయము గుర్తించితిని. మీపై నాకు కోపములేదు. మీరు వచ్చినపని తీరినదిక దయచేయుడన భృగుడు శ్రీహరి శాంత స్వభావానికి ఆనందపడి భగవంతుని దన్నిన అపచారానికి తపించుచూ శ్రీహరీ పాదుపరీక్షకై వచ్చి పరమాత్ముడవైన నిన్ను తన్ని మహాపాపము తెచ్చుకొన్నాను స్వామీ.

జంపెతాళం

దొలగె అజ్ఞానంబు దొలగె యహంకారంబు
దొలగె మదమత్సరము దొలగె తపఃఫలము ।దొ।
ప॥ తెలియనైతిని జగతి లీలావినోదుడని
దెలిసితిని శాంతశమదాది సద్గుణుడని

కఠిన హృదయుడను నిను నా కాలదన్నితిని క్రూరుడ
కటకట నరకప్రాప్తమె గలిగె జన్మజన్మాలకు ।తో।

గీ॥ అసురసంహార నటవర్తి యఘునివర్తి
అఖిల మునిశక్తిహరణార్తి యతులకీర్తి
గర్వతిమిరాంధ భృగుముని విశ్వకీర్తి
శాంత శమదాది దేవత చక్రవర్తీ

వ॥ నిన్ను తన్నిన పాపం ఎన్మి జన్మలెత్తిన తీరునా ప్రభూ నా తప్పు క్షమించి నన్ను రక్షించు స్వామీ అని ప్రార్థింప మాధవుడు మందహాసంతో,

చ॥ అని తన పాదపద్మముల నంటి తపించెడి మౌనిగాంచి యో
యనఘ స్వగర్వ నాశనము నందెడు కర్మను వాక్యబంధమే
మునివర నీదుమూలమున పుణ్యుడ లక్ష్మిదొలంగె నాకిలన్
వనిత వియోగవార్ధిబడ వేయుట ధర్మమకో భృగోత్తమా.

వ॥ మునివరా విచారింపకుము నీవు తప్పుచెయుటకు రాలేదు. కాని నీవలన మా గొప్పదనము వెల్లడియైనది. నీకు మేలగ్గును పోయిరమ్మని బుజ్జగించి బంపెను.

( లక్ష్మీదేవి హరిపై యలిగి భూలోకానికేగుట )

గీ॥ హరిని క్షమవేడి స్మరియించి దిరిగి భృగుడు
మునుల దరిజేరి యనియె త్రిమూర్తులందు
యజ్ఞఫలభోక్త శ్రీమహావిష్ణుడనగ
యజ్ఞఫలమర్పణముజేసె యతులు హరికి

వ॥ త్రిమూర్తుల సంగతి మునులందరికి జెప్పి శాంత సత్వగుణ ప్రధానుండు శ్రీ మహావిష్ణుడే పరమాత్మ అని యజ్ఞఫలము శ్రీహరికి దాక బోయించెను.

తోహర

మునినాధుడేగ శ్రీహరి లక్ష్మిని మన్నింపుమంచు వేడా
చెనటి మునిదన్నె నా నివాసమున నే సరస నుందు సీతోడా
పౌరుష హీనుని బ్రతుకేల పురుష పతివి నాకింక ఏలా
పరువులేని నాజీవితమికేల పలువురు నవ్వరే మనలా.

వ॥ మహాలక్ష్మి కోపగింప మాధవుడు నవ్వుచూ ప్రాణేశ్వరీ భక్తునకు భగవంతునకు గల సంబంధము నీకర్ధముగాక ఆగ్రహించుచున్నావు. భక్తుల మనస్సు తెలుసుకొనుట చాలా కష్టము. అది నాకు దప్ప ఇతరులకు తెలియదు. సుమా భృగుమహాముని గొప్ప బ్రహ్మజ్ఞాని పరమ భక్తుడు అతడొక గొప్ప కార్యము సాధింప అట్లు చేసెగాని గర్వముతోగాదు. మన భక్తులను మనమే శిక్షింపవచ్చునా, బిడ్డలు చేయు పనులకు తలిదండ్రులు కోపింతురా శాంతింపుము.

గీ॥ ఎంత బ్రతిమాలినను సుంతయేని లచ్చి
పదిగ్రహింపవు తపసి మన పుత్రసముడు
తల్లి చనుబాల గరచిన తనయు జంప
ధర్మమా తెలివిమాలిన తామసమున

వ॥ శ్రీహరి వాక్యములు లక్ష్మీదేవికి నచ్చక ఆవేశముతో భృగుచేసిన పని మీకిష్టమౌగాక నేను మాత్రము సహించను. ఆ దుర్మార్గుని శిక్షింపకున్న నేనొక్క క్షణమైన వైకుంఠములో నుండను.

సీ॥ సరివారిలో నిట్లు చనువుచే మన్నింప
గొల్లడైనను మిమ్ముగొట్టగలడు
వసుధ జనులు బోయవాడని రాళ్ళచే
గొట్టు మ్లేచ్ఛులు నీచకునిగజూచి
నెడబాపినట్టి బ్రాహ్మణుల బిక్షాటనన్
నిత్యకర్మలు మాని నియతలేక
విక్రియ విద్య జీవిత లగుదురని దిట్టి
నిర్ఘాడి యోజన దూరమునను.

గీ॥దరను కరవీరపురి కొల్హాపురముజేరె
పత్నినెడబాసి హరి మనోవ్యథను జిక్కి
వ్యాకులంబున వైకుంఠ హీనకళను
జెందుటన్ గాంచి తన మదిని గుంజెనిటులా.

వ॥ ఈనాటితో మీకు వాకు రుణము తీరినది. మనల ఆ దుర్మార్గుడగు బ్రాహ్మణుడు వేరుచేసె గాన నిక బ్రాహ్మణులు భూలోకంలో వేదకర్మహీనులై, దరిద్రులై విద్యలనమ్ముకొని జీవింతురుగాక అని శపించెను. ఒక మునివలన బ్రాహ్మణజాతికెంతటి ఆపద గల్గినది.

మంజరి

పరునిచేత నవమానము జెందియు
బ్రతుకుటకంటెకు నడవిన్
గిరిదరినో ముక్కుమూసి తపంబున
జరియించుటే మేలవనిన్
వైకుంఠము భర్తప్రేమ సుఖముల
విడచి గోదారి చంతన్
దగు కొల్హాపురిచెంత ఆశ్రమున
నొకట తపంబున నిలచెన్

గీ కనకమయమగు గృహమును కాలదన్ని
బంధుమిత్రాప్త పరిచయ పతినివీడి
సరస మిసుమింత చూపక చనియె లచ్చి
తరమె స్త్రీ చిత్తమున్ గాంచ ధాతకైనా.

( భార్యా వియోగంతో విష్ణుమూర్తి శేషాద్రి చేరుట )

వ॥ హరి ఎంత బ్రతిమాలిన వినక లక్ష్మీదేవి నదీనద గహన పర్వత పట్నముల దాటి గోదావరితీరాన కొల్హాపురంవద్ద పర్ణశాల నిర్మించుకొని తపస్సు ప్రారంభించెను. మహాలక్ష్మిలేని వైకుంఠం కళలేకిల్లాడకి పాడుపడినట్లు దరిద్ర దేవత తాండవిస్తుంది. విష్ణుమూర్తి మనసంతా వికలమైనది.

మంజరి

లక్ష్మిలేని వైకుంఠము నీగతి కళాహీనమైదోచు
లక్ష్మీకటాక్షములేని జనులెల్ల బికులౌదురటంచు.

గీ॥ ధనమదంబున నరక బాధలనుజిక్కి-
యనుభవింతురు గాన నేనెట్టులైన
భక్తులకు ముక్తిమార్గంపు సూక్తిదెల్పి
చెంచెలంబగు లచ్చికిఁ జిక్కనీక
రక్షణముజేతు నిహపర మోక్షసుఖము॥

వ॥ భక్త రక్షణ మరచి భార్యావియోగముతో వైకుంఠము విడచి లక్ష్మి దేవిని వెతకుచూ భూలోకంలో చేరినాడు. రాత్రనక పగలనక కొండలు గుహలు మహారణ్యములు తిరుగుచూ నిద్రాహారములు మాని నోరులేని జంతువులను వృక్షవానర తపసుల మహాలక్ష్మిజాడల నడుగుచూ నిదురలేక కన్నులెర్రబారి మొగము కళాహీనమైనది ఆహారములేక శరీరము శుష్కించినది. ఉన్మత్తుని వలె లక్ష్మి లక్ష్మి ఎందున్నావు అని కేకలువేస్తూ కొన్నాళ్ళకు శేషాద్రి ప్రాంతచేరి వెతుకుచుండె.

సీ॥ క్షీరసాగరమున వరపద్మమున నుండి
ప్రభవించినట్టి మేల్పసిడిబొమ్మ
శారదేందు వదన శశిధరహాసిత
మీన నయన హంసయాన గమన
కౌస్తుభమణి వక్షహృదయ పీఠికయందు
నలరారు వలపుల కీలుగోల
నీమధుర అధరాన గామసుఖముల మేను
మరపించి సుఖమిచ్చు మారజనని.

గీ॥ నీవె నాపంచప్రాణముల్ నీవె కనులు
నీవె నాప్రేమ యమృతంబు నీవె తార

ఎందు నున్నావొ ఏగతి గాంతు నిన్ను
భోగ సుఖభోగి ప్రియకాంక్షి భాగ్యలక్ష్మి.

అని శ్రీహరి నిటు భార్యావియోగ మొందుచు ద్రిమ్మరనగా.

(శేషాద్రి చరిత్ర)

మునిగణములు శేషాద్రిచరితంబు విన్పింపుమనగ ఘనుడు వినిపించె నిట్లు శేషాచల కథ వేదవ్యాస శిష్యుండు.

గీ॥ ద్వాపరాంతమునందు కృష్ణావతార
మంతటన్ వీడి వైకుంఠ మందిరమున
లక్ష్మితోగూడి విష్ణుండు కాంక్షనుండ
వాయుదేవుడు దర్శన వాంఛజేర.

వ॥ ఒకనాదాదిశేషుడు వైకుంఠద్వారము గాయుచుండ వాయుదేవుడు స్వామిని దర్శింప లోనికిన్ పోబోవ ఆదిశేషుడడ్డగించి, ఓయీ శ్రీవల్లభుడు ఏకాంతమునసుండి రిపుడుబోరాదన, వాయుదేవుడాగ్రహించి,

గీ॥ విష్ణుపరిశయనమును గూడదనుచు నన్ను
నిట్టి ఆక్షేపణము చేయుచుండి పౌర
గర్వమున జయవిజయు లేగతిని చెందె
అట్టి ఫలితము నీకిక బట్టెనేమొ.

మంజరి

నగ నాదిశేషుండు ఆగ్రహోదగ్రుడౌచూ
గర్వింతువిక నీదు గర్వమడంతు నటంచు
నారదుడుగాంచి బలాబలంబులు తెలియన్
ానందగిరిన్ స్నేవుబట్టుకొను మనియెన్.

వ॥ వారిద్ద రొంరికన్న మరొకరు బలవంతులమని తగవులాడుకొను సమయమున శ్రీహరి స్మరణచేస్తూ నారదముని వారిద్దరి వాదము విని, ఓ శేష వాయుదేవులారా మీరిద్దరు మహాబలవంతులే. వృథా వాదులాడిన ప్రయోజన మేమున్నది. ఒకవేళ మీగొప్పతనములు తెలుసుకొన దలచినయడల మీకొక యుపాయము చెప్పెద వినుడు. ఆదిశేషా నీవు మేరుపర్వతు కొమారుడైన ఆనందపర్వతుని జుట్టిపట్టుము. వాయుదేవా నీవాదిశేషుడు జుట్టిబట్టినపర్వతమును నీ బలంచేత కదలింపచేయుము. కదలించితివా నీవే బలుడవు. లేకున్న ఆది శేషుడే బలవంతుడని నారదముని సలహా నిచ్చెను. వారిద్దఱుగ్రులై

మ॥ అనుచున్ బల్కగ ఆదిశేషుడపు డానందాద్రినిన్ జుట్టి బల్
ఘనవాయుండటు వీచె ఘర్జనభయంకారార్భటిఁ లోకముల్
వనముల్ సప్తనగాగ్ర సాధుసురలఁ వారిఁ బడన్ భీతులై
గనె పద్నాలుగు లోకముల్ హరిహరుల్ కల్లోలమై మారుతిఁ

వ॥ ఆదిశేషుడానందపర్వతాన్ని గట్టిగా చుట్టుకొన్నాడు. వాయుదేవుడు రౌద్రుడై తన బలమంతాచూపి కదిలింప ప్రయత్నించె కాని. ప్రయోజనములేక కోపించి సుడిగాలి తుఫానుపలె జంఝామారుతంతో రాత్రిపగలనక వాయుదేవుడు గాలి వీస్తున్నాడు. ఆదిశేషుడుకూడా తన బలమంతా వినియోగించి పట్టినపట్టు విడువకున్నాడు. ఘోరమైన ఆ గాలి రసురాసు ప్రళయరూపమై అన్నిలోకాల అల్లకల్లోలమై సకల జీవులు బాధపడుచుండ. ఇంద్రాది దేవతలరుదెంచి.

తోహర

పవనశేషులను ప్రార్థింప వినక ప్రళయకాల రుద్రుండై
పవనుడీచగా చోదక సురముని గణము శేషునిఁ వేడా
నొక శిరము బట్టువిడువ వాయుండు నెగపి ఆకనపథానా
తగమేరువెడల స్వర్ణ వరాహ క్షేత్రమున శేషాచలమునా.

వ॥ దేవతల మొరవిని ఆదిశేషుడు తన పట్టుకొంచెము తప్పింప. వాయు దేవుడా పర్వతాన్ని ఆకాశమార్గమున కెగరగొట్ట. పర్వతం భూలోకంలో ఆది

వరాహక్షేత్రమున బడెను. ఆపర్వతం శేషునివలన వచ్చినది గాన దానికి శేషాద్రి అను పేరు కల్గెనని సూతముని చెప్పెను.

గీ॥ కోరిపురిగొల్పె హరి నివాసార్థమిటుల
జేర్చుకొనె తగవులన్ పెట్టి నారదుండు
యనగ విని దైవకల్పితమైన తగవు
దెలుసుకొని వాయుశేషులు గలుసుకొనియె.

వ॥ అంత నారదనుడిట్టి యుపాయముతో శేషగిరిని భూలోకము జేర్చెనని తెలిసి వాయు నాదిశేషులు తమ నివాసములకు జనిరి.

తోహర

శేషాద్రిపైన తింత్రిణీవృక్షముజేరి వల్మీకమరసీ
శ్రీనివాసుండు తలదాచుకొనెయె శ్రీని తన మదిఁదలచీ.

వ॥ ఆశేషాద్రిదాపున లక్ష్మీదేవిని వెదకుచూ పేసారి ఒక చింతచెట్టు నీడలో నొక పుట్టనుగాంచి, నిందైననూ కొన్ని దినాలు తలదాచుకొని నెవరికి కనుపించక నుండదలచి ఆపుట్టలోచేరి శ్రీహరి అందే కాలముగడుపుచుండెను.

ఉ॥ నారదొక్కనాడు హరినామముబాడుచు బ్రహ్మలోకముఁ
జేరియు మర్త్యలోకమున శ్రీహరి జేర్చుమటన్న జేర్చితిన్
భార్యనుబాసి తాత తన భర్తను వీడిన లక్ష్మీదేవియున్
ఘోరఘచార సాగర దుఃఖాబ్ధిని మున్గిరి నేమిసేయుదున్

వ॥ అని వగచి బ్రహ్మనుజేరి తండ్రీ మీరు చెప్పినట్లు శ్రీమహావిష్ణు భూలోకమున అవతరించుటకు యత్నము చేసితివి గాని లక్ష్మీనారాయణులకు యడబాటై, లక్ష్మీదేవి కొల్లాపురమున తపస్సుచేయుచున్నది. నారాయణమూర్తి శేషాద్రియందు నొక పుట్టలోజేరి భార్యా వియోగమున నిద్రాహారములులేక శుష్కించెపోవుచున్నాడు కాన నీవెట్లయిననూ యోచించి శ్రీహరికి ఆహారము నివ్వవలెనని ప్రార్థించెను.

గీ॥ బ్రహ్మ కైలాసుజేరియు బల్కెనిట్లు
స్వామి శ్రీహరి తన లక్ష్మీవీడి భువిని
శేషగిరిలోన పుట్టలోజేరి నృక్కె
గాన నెటులైన హరిని గాపాడవలయు

వ॥ బ్రహ్మ కైలాసమేగి శంకరుని వేడి స్వామీ వైకుంఠవాసుడు భూలోకమున శేషాద్రిపై ఒకపుట్టలో తలదాచుకొని నిద్రాహారములులేక యుప వాసములు చేయుచున్నాడు. మనమిద్దరం ఆవుదూడ రూపములుదాల్చి, పాలిచ్చిన కొంత మేలన, శివుడు సంతసింప బ్రహ్మశంకరులు భూలోకమున కొల్లాపుర మున తపముచేయు లక్ష్మీదేవినిచేరి పలుకరించిరి.

తోహర

పతిదేవునిపై యలిగి వైకుంఠపదవికి దూరముజేసి
సతివియోగమును జెందెను నీపతిగతిని సుంత యోచించి.

వ॥ అమ్మా లక్ష్మీదేవీ నీకోపకారణమువల్ల ఆనందమైన మీ సంసార మెన్ని కష్టములు గల్గెనో చూడుము. నీభర్త వెత్రివాడై నీమీద బెంగచే తిరు గుచు శుష్కించి పోవుచున్నాడన. నాకు గలిగిన అవమానమువకు సహింప లేకున్నాను మీదారిని మీకు పొండన శంకరుడు నవ్వి.

కం॥ ఇది వక దేవరహస్యము
ముదితరొ మునిదన్నెననుచు మూర్ఖుతోడన్
మదిలో నాగ్రహము విడు
పతిసేమమె పత్నిగోరు పద్మదళాక్షి.

వ॥ జరిగిన వృత్తాంతము వినుమని బ్రహ్మ, శివులు లక్ష్మీదేవికిటు విన్పించిరి.

మంజరి

నారదముని వకనాడు భూలోక నరకయాతనలుగాంచి
హరిభూలోకము విడచి వైకుంఠపురి చేరుటచేనెంచి

శ్రీహరిని ధరణిజేర్పదలంచియు శీఘ్రమె గోధావరికిన్
మహారుషులెల్ల యజ్ఞమొనరింప మంచిదనుచు జనమునికిన్
అర్ఘ్యపాద్యముల నర్పింప యజ్ఞభోక్త సత్వగుణునెరుగన్
అరపి భృగుమౌని హరియె సత్వగుణుడని యజ్ఞఫలంబొసగెన్

సీ॥ లోకరక్షణకు భూలోకాన శ్రీహరి
జేరు సుపాయంబు జేసె నమ్మ
భృగుమహారుషినంపి పుణ్యదంపతుల మీ
కెటబాటు గల్పించ నేగెనమ్మ
శేషగిరిన్ చేరి శ్రీనివాసుడెంతొ
దిరిగి క్షుద్బాధచె నొరిగెనమ్మ
భక్తజనులెల్ల నుద్ధరింపదలచి
కలియుగదైవమై వెలసెనమ్మ.

గీ॥ సకల జనరక్షణకై నిట్లుజేసెనమ్మ
కాంతుడే సత్వగుణుడు నీనాధుడమ్మ
కోపమును వీడి శ్రీహరిన్ జూపరమ్మ
తాపమును దీర్చి నీపతిన్ గావరమ్మ.

వ॥ భూలోక అరణ్యములన్నియు దిరిగి నీవు గాన్పింపక ఇపుడు శేషాద్రి మీదనొక పుట్టలో తలదాచుకొని అన్నయాహారములేక శుష్కించిపోవు చున్నాడు గాన.

ఉ॥ నీవొకగొల్లభామగను నేనొక ఆవుగ బ్రహ్మ దూడగా
బోవలె చోళరాజ్యమున భూవరుడాతని కొప్పగించు మే
మావల శేషపర్వతముపై గల పుట్టనుజేరి క్షీరముల్
ద్రావగనిచ్చి శ్రీహరికి దాహము నాకలి దీర్తుమమ్మరో.

వ॥ అమ్మా మేమిద్దరము ఆవు దూడ రూపములు ధరింతుము. నీవు గ్రభామ వేషముధరించి, దోలుకొనిపోయి చోళరాజునకు విక్రయించిన మేము

రాజు ఆవులమందలో నుండి ప్రతి దినము శ్రీహరికి పాలునిచ్చి గాపాడుదుమన మహాలక్ష్మి సమ్మతించెను. బ్రహ్మ శివులు ఆవుదూడ రూపములు దరింప లక్ష్మీ దేవి గొల్లభామ వేషము ధరించి ఆవుదూడల దోలుకొని చోళరాజు పాలించు చంద్రగిరిచేరి పాలోయమ్మ పాలో అని పాడుచున్నది.

జంపెతాళము

కామధేనువుబోలు కామితార్థములిచ్చు
కళ్యాణముల గూర్చున్ కళ్యాణి గోమాతః
కల్పవృక్షంబుగా కవిజనుల బాలించు
కైలాసపతి శివునిగా క్షేమంబుల నరయును॥
ఇల శ్రీహరి భక్తిన్ పలుదానము లిచ్చిన
ఫలితంబులు గల్గున్ గొలచిన గోమాతన్ః

గీ॥ అనగ నాచంద్రగిరి రాజస్థానమందు
గొల్లభామను బిలిపించె చోళరాజు
గౌరవించియు గోవత్స మరపి గొనియు
గోపకున కొప్పగించె వెల్ గోగణముగా.

వ॥ అపుడు చోళరాజు అతని భార్యజూచి, సంతసించి గొల్లభామను పిలిపించి ఆవుదూడను కొని ఆమెకు వస్త్రభూషలనిచ్చి బంప. లక్ష్మి తనదారిని దానేగెను. చోళరాజున కనేక ఆవులమందలుండుటచే బసులకాపరిని బిలిచి ఓరీ యీ క్రొత్త ఆవును చాలా శ్రద్ధాభక్తులతో పోషించి పాలుపితికి మాకిమ్మ అని ఆజ్ఞనిచ్చెను. గొల్లడా ఆవును లేగనూ తన ఆవుల మందలో కలిపి శేషా చలమునకు మేతకు తోలుకొని పోపుచుండెను. ఆయావు ఆవులమందతోపాటు మేయక వంటరిగాపోయి విష్ణుమూర్తిదాగివున్న పుట్టలో నెవ్వరికి తెలియకుండా పుట్టలో పాలు ధారలు కురిపింప. శ్రీహరిదాగ మరలవచ్చి మందలో చేరు చుండెను.

తోహర

సీ॥ నంత పదివేల గోసమూహంబున
గోవు ప్రతిదినము కూర్మిన్
చెంత శేషాద్రి వల్మీకమునన్
స్తన్యమిడె కృష్ణస్వామికిన్
క్షుదదీర నారగింప క్షీరములు
క్షీణించ రాజపత్ని
క్రోధమున బాలు క్షీణించెనంచు
గోపకుని గొట్టి నాతి

గీ॥ గోముఖ వ్యాఘ్రమునువోలె గోవుపాలు
ద్రావితివి కఠినశిక్ష విధింతునంచు
యనగ బాసనుజేసి నేనెరుగనంచు
గోరహాస్యము కనుగొన గొల్లడరిగె.

వ॥ ఆమ్మా నేనేపాపము నెరుగను పాలు పిండుటకుపోగా పాలులేక చన్నులెండిపోవు చున్నవి. ఆదేమి మాయయో నాకు తెలియుటలేదని వేడ మహారాణి మండిపడి మూర్ఖుడా పాడియావుదగ్గర పాలు లేకుండునా నీమాట నమ్మబెట్లు ఈ రోజు పాలుతేకుంటివా నిన్ను కఠినముగా శిక్షింతునని గద్దింప గోపాలుడాయావును నొక కంట కనిపెట్టవలయునని. ఆవులమంద శేషాద్రికి దోలుకొనిపోయెను.

ఉ॥ గొడ్డలిబూని క్రోధమున గోవెనుకఁజనుచుండ ధేనువా
పడ్డను వీడి పర్విడి పాలు వల్మీకమునందు నింపగఁ
బడ్డకడాగ్ని ప్రాన్చిజనె పాపుడు గోవును గొట్టబోయినా
గొడ్డలివ్రేటు శీర్షమున ఘోరత గొట్టెను శ్రీనివాసునిన్.

తోహర

గోగతకనై శ్రీనివాసుండు గొబ్బున పైకిఁ జూడా
క్రూరగొల్లడుఁ గొడ్డలివ్రేటుఁగొట్ట శ్రీనివాసుండా

రక్తసక్తమగు తాళప్రమాణము ప్రవహింప గొల్లగాంచి
నేత్రముల్ దిరిగి మూర్ఛిల్లెగోవు రక్తమయత దుఃఖించి
చోళరాజ ఆస్థానముఁజేర చోద్యమంది దిర్ఘ్రిమతఁ
విలపించి సరచు గోమాతను గని విభుడు మంత్రులఁ చింతఁ.

ఉ॥ వంతను చోళరాజు పరివార జనంబులగూడి అశ్వమున్
న్నంతటనెక్కి శేషగిరినందు వల్మీకము చెంతజేరియా
వింతను రక్తపాతమయ వేడిప్రవాహముగా గొల్లకుం
డెంతయు ప్రాణముల్ విడచె నందు శవంబునుగాంచి ఖిన్నుడై.

కం॥ క్రూరకుడెవ్వఁడో గోపకు
మారణమొనరించె నంచు మరిదూషింపఁ
దారుణ క్రోంధంబుననా
మారుని జనకుండు శాసవహ్ని శపించెఁ.

వ॥ తన పొదుగును పుట్టపైనుంచి పాలధారలు పుట్టలోనికి కార్చుచుండ ఆ చిత్రం గాంచిన గోపాలునకు కోపమువచ్చి ఆవును సమీపించి తన చేతనున్న గండ్రగొడ్డలి పైకెత్తికొట్టబోయె కాని తన కుపకారము చేయవచ్చిన ఆవుకు ఆపదవచ్చెనే యని పుట్టలోనున్న విష్ణుదేవుడు వెంటనే పైకిలేచి ఆవునకడ్డము నిలచెను. గొల్లడువేసిన గొడ్డలిప్రేటు స్వామినెత్తిపై బలముగా తాకి స్వామి తల బగిలి రక్తముపారిన గోపాలుడుచూచి కన్నులు దిరిగి నేలబడి మూర్ఛిల్లెను. ఆవు పర్వతం దిగి పరుగు పరుగున రక్తఘ్నయంతో చోళరాజు ఆస్థానచేరి బిగ్గరగా అరచుచూ కన్నీరుగార్చుటచూచి చోళరాజు ఆశ్చర్యమంది. అశ్వమెక్కి పరివారముతో పర్వతపుట్టవద్దచేరి గోపాలుని రక్తమునుజూచి. ఈ దుర్మార్గము చేసిన వాడెవడని దూషింప శ్రీనివాసుడు పుట్టనుండి పైకిలేచి మండిపడి,

ఉ॥ చోళపురీశ గర్వమున చోరప్రజాపరిపాల ప్రాణభి
త్కాళవిషాగ్ర మానస సదాపరమార్థ విదార క్రూర నీ
కాలముదీరె భూస్థలి నిఘాత పిశాచిత రూపివై ధరఁ
చోళపురిన్ చెలంగుమిక చేసిన పాపఫలంబు దప్పునే.

వ॥ ఇంతలో పుట్టనుండి విష్ణుదేవుడు పైకివచ్చెను. తల గాయకముతో రక్తము గారుచున్నది. చోళరాజును జూచి ఓరీ రాజా గోపాలుని గండ్రగొడ్డలి చేత నన్నుగొట్టింతువ సేకులు చేయు పాపము రాజనుభవింప వలసినదే గాన నీవు పిశాచమైపోదువుగాక అని శపించెను. చోళరాజు స్వామిపాదములపైబడి ఏడ్చుచూ నేనేపాప మెరుగను స్వామీ

చ॥ అని శపియింప చోళ నృపుడా హరిపాదములంటి మ్రొక్కనా
జనపతిగాంచి శ్రీవిభుడు జాలినిబల్కె ఆకాశరాజుపై
జననమునం దొక్కసుత సారసనేత్రి లభించుదానినీ
వనువుగ కన్యదాతగ వివాహముజేయ దొలంగు బాపముల్.

వ॥ స్వామీ నేనిరపరాధిని నన్ను రక్షింపుమని ప్రార్థింప స్వామి ప్రార్థన విని కరుణగల్గి. రాజా నా శాపం వ్యర్థముగాదు. నీవీదేహము వదలి మీ చోళ వంశంలో ఆకాశరాజు పేరుతోబుట్టి. నీకుమార్తెను నాకిచ్చి పెండ్లిచేయుదువు. నాకు వజ్రకిరీటను సమర్పింతువు. నే ప్రతి శుక్రవారము ధరింతును. మరు జన్మలో పిశాచరూపం పోవును. యన నంతలో గోపాలుడు మూర్ఛలేచి గ్రుడ్డి వాడైన నన్నురక్షించు స్వామీ అని ప్రార్థింప ఓరీ నేనీ పర్వతమున వెలసెదను కొన్నాళ్ళకు నీకు నాస్పర్శతో దృష్టిగల్గును నీబాధలు తీరుననిచెప్పి మహావిష్ణు డదృశ్యుడయ్యె.

గీ॥ అనుచు శాపవిమోచనమును నెరుంగ
జేసి యదృశ్యుడైనంత చోళరాజు
కర్మఫలమని పురిజేరి నిర్మలమున
జన్మవిడి భూపుడై భువి జననమందె.

(వరాహస్వామి వృత్తాంతము)

తోహార

కృతయుగమున నారాయణుడు పాలకడలియందు శయనింపా
అతని నాభికమలమున చతుర్ముఖుడా బ్రహ్మయు జనియింపా

తపముజేయు బ్రహ్మనుగని శ్రీహరి ధరజీవుల సృజియింపా
తపఃఫలంబిడి సృష్టికర్తగా దనర నాశీర్వదింపా.

గీ॥ కమలగర్భుడు సృష్టించె కమల జాండ
మత్తతిన్ బ్రహ్మమానస పుత్రులైన
నైదువత్సర ప్రాయులై నెల్లకాల
ములరు సనకస నందనుల్ ఘనతపస్సు,
లరయ వైకుంఠ ద్వారంబు జేరనంత.

వ॥ సనకసనందనుల బాలురని దలంచి. ద్వారపాలకులు లోనికి బోనీక వివారింప వారు ఆగ్రహించి.

పాట—రూపకం

ఔరా జయవిజయులారా అడ్డెదరా మమ్మే మీరలౌరా
నారాయణదాసులయ్యు జ్ఞానమొకింతయులేక ॥ఔ॥
అ॥ కట్టడి తనమున మీరలు కన్నుగాన కిట్టుల మము
నెట్టెదరా మాతీరుగణింపక సంపదంధులై ॥ఔ॥

గీ॥ విశ్వరూపుండైన విష్ణునకున్ జాట
నెట్లదోషజుండు నెనయుమాయ
కన్నుగానకిట్లు గదిమెదరా మమ్ము
ములుచలార రాక్షసులు గండూ.

వ॥ అట్లు రుషులు రాక్షసులై పొందని శపింప శ్రీహరి నెరింగి,

కం॥ అప్పుడుహరి చప్పున జని
యప్పరమునుల తన యాజ్ఞన్
ముప్పునబడు జయవిజయుల
నిప్పగిదిన్ మందలించె రుషులలరారన్

ఖండగతి

ఎంతపని చేసితిరి యీ రుషులనడ్డితిర
మీరు జయవిజయులారా
నుంతయు యుక్తాయుక్తమూహింపక ॥ఎం॥
ఐదేడ్ల బాలురు దిగంబరులు జ్ఞానఘను
లఖిల భువన వందితు లాప్తకాము లీమునులు ॥ఎం॥
దయమాలి వీరలన్ ద్వారమావలనెట్టి
తగినట్లు గుడిచితిరి తప్పతరమా విధి ॥ఎం॥
అంతఃపురమునకు నెవరైన రానీకుడన
తర్ప్రర్తనే యావల నెట్టినయట్లు. ॥ఎం॥

విన
వంశంలో

మంజరి

నాకు వజ్రంకుడు సనకసనందనులు నారాయణు మదినుతియించీ
జన్మలోప్పున తమ పాదంబులపైబడు జయవిజయుల కరుణించీ
వాడై ఏడు జన్మములు విష్ణు మిత్రులై మీరు వచ్చెదర యిటకూ
కా- మూడు జన్మలకు హరివిరోధులై పురినుందుర కడపటకు
కోరుకొండనగ హరి ద్వారపాలకులు శీఘ్రమెరానెంచి
వైరమె మేలగు వత్తుమనగ శాపంబు బిరాన దలించె
అనగ నట్టితాకనుచు నమ్మునులు హరి యాజ్ఞనంది చనిరీ
కనక కశ్యప కనకాక్షరాక్షసాఖ్యలు జయవిజయులు గొనిరీ,

వ॥ ద్వారపాలకులు అడ్డగింప సనకసనందనులు కోపించి, మీరు రాక్షసులై పొండని శపింప. పాదాలపైబడివేడ, మూడు జన్మములు హరి విరోధులై హరిచేజచ్చి మరలా స్వామిని జేరుదురని జెప్పి, శ్రీహరి నుతింపుచూ దర్శించి స్మరించుకొంటూ బోయిరి.

సీ॥ ద్వారపాలురు శాపకారణంబున భువిన్
దితి కస్యపులకు పుత్రులుగబుట్టి

ధరహిరణ్యాక్షుం డుహరుషాంబ గోరగ
ధరనెల్ల జాపగా నరకిజుట్టి
దానవుడున్ రసాతలమున గొంపోవ
శ్రీవిష్ణుదేవునిన్ సురలువేడ
దేవరుషుల్ మునుల సర్వజీవులబాధ
లరశి వైకుంటుండు నాగ్రహించి

గీ॥ భీకరంబగు దంతముల్ వజ్రనేత్ర
మెరపుతో శ్వేతవరాహవతారమెత్తి
అసురలందగ్నిరాల హిరణ్యాక్షుజీల్చె
యుగ్రరూపుని వేడిరి సురలు భక్తి.

పాట

జయజయజయయాది వరాహమూర్తి
జయజయ యోదేవ శ్రీహరి నీకీర్తి ॥జ॥
జగముల హరియించు మాఘోరమూర్తి
జల్లగ దొలగింప జాలిన ఘనమూర్తి ॥జ॥

రవిచంద్రతారకలు అంబరమున
దివివి నుండు నన్నినాళ్ళు నీగిరి
వరములొసగి భక్తవరుల వాంఛల
స్థిరతదీర్చి స్వర్ణముఖిని నిల్వుము ॥జ॥

వ॥ ద్వారపాలకులు హిరణ్యాక్ష హిరణ్య కశ్యపులను రాక్షసులై జన్మిం చిరి. వారిలో హిరణ్యాక్షుడు పరమదుర్మార్గుడై భూమిని చాపగాజుట్టి రసాతలమున్న దాచెను. దేవతలప్రార్థన విని శ్రీహరి శ్వేతవరాహరూపం ధరించి హిరణ్యా క్షుని సంహరించి, భూమిని ఎప్పటివలెనిల్పెను. ఆసమయమున బ్రహ్మమొదలగు వారు వరాహమూర్తిని ప్రార్థించి స్వామీ మీయవతారము గలియుగమున భక్తుల రక్షించుటకు శాశ్వతముగా భూలోకమున నుండవలసినదని ప్రార్థించిరి అట్లే

యుండునని చెప్పి శేషాచలమునందొక నివాసమేర్పరచుకొని మహాయుసురాది భక్తులతో ఇష్టాగోష్టినుండి భక్తరక్షపపై నిలచెను.

(వకుళాదేవి చరిత్ర)

తోహర

వరాహక్షేత్రముజేరి భక్తితో వకుళమాల సేవింపగా
వకుళాదేవననేవరాత్రీయన పచించె సూతుడు కథనాలింపన్
హరి గరుత్మంతు బంపి వైకుంఠపురిలో యానందాద్రిన్
జేర్పించి శేషగిరిపై నిలచెను స్వామిగ యీ వరాహాద్రిగా.

గీ॥ ద్వాపరాంతమున బోయవాని వాడి
బాణమున బొటనవ్రేల్గొట్టి బాధతోడ
బంధుజన భక్తులగా బిల్చి పోదునింక
వేగ వైకుంఠపురి కృష్ణస్వామిజెప్ప.

కం॥ అని శ్రీకృష్ణుడు బల్కగ విని కనియు యశోదదేవి వెక్కి వెక్కి డ్చెన్
గని గోపాలుడు తల్లికి వినయంబున జెప్పెనిట్లు విశ్వాసమునన్.

వ॥ ద్వాపరమున శ్రీకృష్ణపరమాత్మ అపతారము చాలించి వైకుంఠమునకు బోదునన దెలిసి ద్వారకావాసులు బంధుమిత్ర భక్తులు యశోదాదేవియు నతని విడచియుండలేమని దుఃఖింప కృష్ణుండు వారితో, ఇక కొంతకాలంలో కలియుగము ప్రవేశింపనున్నది. మీరందరు నన్ను ధ్యానించి నాయందు చేరగలరని వరమిచ్చెనంత యశోద కృష్ణా నిన్ను పెంచి పెద్దచేసి నీ కళ్యాణ మొకటైనను చూడనైతి నాకాభాగ్యములేదా యని దుఃఖింప. కృష్ణుడు కన్నీరు తుడిచి అమ్మా నీకోరికను నేను కలియుగంలో వేంకటేశ్వరావతారమున దీర్తును నీవీ శరీము విడచి వకుళమాలవై శేషాచలమున వరహాస్వామిని సేవించు చుండుము. కలియుగమున నేనక్కడికివచ్చి కలుసుకొందునని చెప్పెను.

తోహర

శ్రీకృష్ణుడు వైకుంఠపురిచేగ నాయశోద దేహమువిడచి
వకుళదేవిగా జన్మించె శేషాద్రి వరాహస్వామిన్దలచే
యుగధర్మంబులు గతయాగతములు వినుచు సేవింపుచుండా
భగవాన్ శ్రీహరి భార్య గాయమున బాధనుజెందుచునుండా.

వ॥ శ్రీహరి తలగాయముబాధ భార్యావియోగ బాధతో నుండ,

గీ॥ దేవగురుడౌ బృహస్పతి దేవదేవు
గాంచి వనమూలికల్ దెచ్చి కట్టుకట్టి
వేదదీర్చియు సెలవొందె శ్రీనివాసు
డంత వృషభాద్రిపై లక్ష్మి నెతకుచుండా.

వ॥ దేవలోకమునుండి దేవగురు బృహస్పతి శేషాద్రిచేరి శ్రీహరిగాయమునకు తగు ఔషధకట్టుగట్టి శలవందిపోవ. స్వామి బాధ కొంతతగ్గి లక్ష్మీదేవిని వెతకుచూ వృషభాద్రిపైనుండి పయనించెనన, (రుషులు వృషభాద్రని పేరు కల్గిన కారణమడుగ,

(వృషభాసురవధ)

ఆది—హంసధ్వని

వినుడు వృషభాసురుని చరితంబును
వినిపించెదమీకున్ వీనులకు విందు ॥వి॥
గనుడు నీక్షేత్ర ఈశాన్య భాగమున
యామడ తుంబుర నాతీర్థంబున ॥వి॥

అ॥ ఘనముని సురసేవిత తీర్థంబు
పుణ్యపవిత్ర నివాసతీర్థంబు

జన పాపనాశ తీర్థంబు
జగతి పవిత్ర తుంబుర తీర్థంబు ॥వి॥

సీ॥ నాస్థలంబు నొక్క వృషభాసుండను
వృషభశృంగుడైన రాక్షసుండు
నారశింహమూర్తి వరసాలిగ్రామంబు
భక్తిపూజింపుచుఁ బ్రతిదినంబు
పూజాయనంతరమ్మున తన శిరమును
చేదించి పుష్పాళిజేర్చి మ్రొక్కు
తన శిరంబును యథాస్థానంబు నందంటి
మొలచు సాలిగ్రామమహిమచేత.

గీ॥ ఇర్వదెనిమిది వర్షముల్ సీమమెప్ప
సాలిగ్రామము పూజించి సాధుజనులు
అనుపులన్‌దీసి బాధించు నసురవృషభు
బెట్టు బాధలు బడలేక విష్ణువేడ.

వ॥ దున్నకొమ్ములు గల్గిన రాక్షసుడొటచే వృభభాసురు డనుపేర సాలిగ్రామ మహిమాబలప్రభావంలో వాడు సాధుజన దేవగణములందరినీ చీల్చి జంపి తినుచు నందరినీ నాశము చేయుచుండ కొందరు రుషులు తపసులు బాధల భరింపలేక విష్ణుమూర్తిని ప్రార్థించిరి.

గీ॥ శంఖచక్రగదా పద్మశేషశాయి
శ్రీసతీనాథు జగదేక చక్రవర్తి
అసుర బాధలకెంతయు నార్తిజందు
తపసిమొరవిని హరియు ప్రత్యక్షమయ్యె.

మంజరి

శ్రీహరి దర్శనమీయ మునులెల్ల చిత్తమలర నుతియించి
మాయార్తిఁ దొలగించి వృషభునిఁ మ్రందజేయు మనగాంచి

నారసింహ రూపుంచై వృషభుని నరసి వరమీయదలచీ
పరిశనంబిచ్చి కోరుమన మెచ్చి దనుజుడు హరి వీక్షించి.

గీ॥ భక్తవత్సల నరసింహ భవ్య తేజ
శంఖచక్రాస్త్ర మాయాగ్రయుక్తవౌర
శక్తిగలదేని నీ భక్తు సాలిగ్రామ
ముక్తినాకేల నిను బోర ముదముగల్గె.

ఖండగతి — శ్రీరాగం

శూరత ను నిన్నెదిరి బవరమొనరింతునా
పరమొసగి నిలునిలువుమా దురమున నినుగూల్చెద ॥శూ॥
మారకుడ నసుర సంహార నిన్ మారికిన్
బలిచేయనెంచి నీకై బహు తపమొనర్చితిన్ ॥శూ॥
హరివి సాలగ్రామ మాక్రమించియు మోస
కారినన్ చేరినావా కరివరదుడవను గర్వమ ॥శూ॥

గీ॥ అంచు భుజమప్పళించు రాక్షసునిగాంచి
హరియు చిరునవ్వునన్ దనుజునకట్టె గోరు
వరమొసంగెదనంచు శస్త్రాస్త్రములను
గుప్పునెడ చప్పునన్ ద్రుంచె మెప్పుతోడ.

వ॥ అపుడు శ్రీహరి సకలమునిదేవరుషుల ఆర్తిబాప నారశింహరూపుడై వృషభాసురుని మోల ప్రత్యక్షమై నీభక్తికి మెచ్చితి ఏదైన వరము కోరుమిత్తుననన రాక్షసుడు వికటాట్టహాసమున నవ్వి మదోద్రేకంబున నాతో యుద్ధముచేయుము. నిన్ను వధించి నీమాయలడంచి నాపేరు బడసెదనని ఎదిరింప శ్రీహరి అటులే కానిమ్మని శస్త్రాస్త్రములు రాక్షసుపై గుప్ప వాటినన్నిటిని ద్రుంచెను. నంత శ్రీహరియు వృషభాసురులు ఘోరముగా పోరాడిరి.

చ॥ నిలునిలు మెందుబోయెదవు నీచుడ నీచముడంచు శూలముగ్గా
నిలువునవేయ శౌరియును నిల్చిశరంబుల ద్రుంపతప్పగద్గా

బలిమిని దైత్యుడుఁ గొనగ బాణములన్ బడగూల్చె శ్రీహరిఁ
యలుక వహించి ఖడ్గము సంతమెనర్తునటంచు బోరగఁ.

గీ॥ దైత్యుపై హరియు సంధించె నైదుశస్త్ర
ములను గూల్చియు దనుజుండు బాలమేయ
నొక్కశరమున హరి ద్రుంప నక్కసుండు
గదనుగొని ఘర్జనన్ నొంచె ఘనశరాళీ

చ॥ సురగరుడోరగ ప్రముఖ సూరిజనుల్ నుతియించు చక్ర మి
త్త్రరి మకరిఁ మహాదనుజ దర్పిత మస్తక క్వారచ్ఛేద దు
ర్ధర యని లాగ్ని కీలక ప్రభాస్ఫుట వజ్రకుశాను తూల్య మ
త్కర స్థిర కాల మీ శిరము ఖండిన చేతును చక్రధారిచే

వ॥ మహా కరవాల గదాశూల అనేక శాస్త్రాస్త్ర ఆయుధంబులతో పోరాడుచూ నెదిరించు దనుజుపై శ్రీహరి ఆగ్రహించి తన సుదర్శన చక్రము ప్రయోగింప బూన

తోహర

అను చక్రిఁ గని దనుజ కేల్మోడ్చి. నను గూల్చెద వీ గిరినీ
అనఘ వృషభాద్రి యను నామంబున. నలర జేయు మీధరణీ,

శాశ్వత కీర్తిని పరమిడి శీర్షము చక్రధారచే చెండా.
చేరే తన లోన జగతి వెల్గ, తేజంబ సురాంతకు తోవా॥

శ్రీహరి చక్రప్రయోగము చేయ మానుట చూచి: వృషభాసురుడెటులైన తనకు మరణము దప్పదని, చేతులు జోడించి స్వామీ సాలిగ్రామ పూజా పుణ్య ఫలంగా నాకోరిక మన్నించి ఈ పర్వతానికి వృషభాద్రియను పేరు శాశ్వతంగా నిల్పి నాశిరం ఖండించండి. నీలో నన్ను గల్పుకొనుమని వేడుటచే, వృషభాద్రి యను పేరు వచ్చినదని సూతముని జెప్పెను.

గీ॥ భక్తుడసురనికోర్కె దీర్పంగనెంచి
సాధుముసిజన భక్తుల బావదీర్ప

త్వరను వృషభాసురున్ గూల్చుకారణమున
బరగు వృషభాద్రియను నామకరణమొప్పె.

వ॥ అంత దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. అటునుండి శ్రీహరి యరణ్యాదుల దిరుగుచు కొంత దూరాన వరాహస్వామి ఆశ్రమము కన్పింప వరాహస్వామిని జేరెను. శిష్టదేవుని గుర్తించి గౌరవించి వైకుంఠము విడచి ఈ భూలోకమునకు వచ్చిన కారణమేమని యడుగ శ్రీహరి వరాహస్వామితో ఇట్లు జెప్పెను.

సీ॥ లోకరక్షణకు భూలోకాననన్ జేర్ప
నెంచి నారదుడు యోచించి భృగుని
జని త్రిమూర్తులలోన సత్వగుణుం డెవడో
అరసిరమ్మన వికుంఠపురముజేరి
వక్షంబునఁ దన్న మహాలక్ష్మి యల్గి భూ
లోకాన తపసియై శోకమందె
పత్నివియోగినై వైకుంఠముఁ వీడ
గొడ్డలిఁ దలగొట్టె గొల్లవాడు.

గీ॥ నిలువ నీడయు తోడు నాకెవరులేక
నిన్నుజేరితి స్థలమిచ్చి నన్ను నిల్పి
పుణ్యముఁ గట్టుకొను వరాహమూర్తి యనగ
సంతసంబున స్థలమిచ్చె స్వామిదరిని.

వ॥ త్రిమూర్తుల పరీక్షార్థము వచ్చిన భృగుమహాముని నా వక్షమున దన్నెను. లక్ష్మి కోపించి నను విడచి కొల్లాపురంచేరి తపంచేస్తూ కూర్చొనెను. నేవైకుంఠములో నుండజాలక ఈ శేషాద్రి పర్వతముపై నొకపుట్టలో తలదాచుకొన నంతలో నొక పశులకాపరి నాతలపై గండ్రగొడ్డలితో కొట్టగా గాయమైనది. గాయము మాన్పు ఔషధము వెదకుచూవచ్చి మిము గంటిని. యీ కొండపై వసింపవలెనని తలచుచున్నాను. గాన నేనిందు వసించుటకు కొంత స్థలమిచ్చి

పుణ్యముగట్టుకొనుడన. వరాహస్వామి నేనిచ్చు స్థలమునకు క్రయధనమిత్తువా యన. శ్రీహరి స్వామీ మీరు గొప్పవారు మీకు తెలియని ధనము నావద్ద ఏమున్నది. నాకు స్థలమిచ్చిన ప్రతిఫలముగా నా భక్తులను రప్పించి వారిచే ముందుగా తమ దర్శనము చేయించి నైవేద్య కానుక లర్పించిన అనంతరము నేను పుచ్చుకొందును. నింతకన్న నేనేమి చేయగలనన వరాహస్వామినప్పుకొని నూరడుగుల స్థలమిచ్చి నావద్ద వకుళమాలికాదేవి యను భక్తురాలున్నది. ఆమెతో సర్వోపచారములు పొందుచుండుమని చెప్పి వకుళాదేవిని నొప్పగించెను.

మంజరి

హరి వరాహస్వామిచ్చిన స్థలమున
ఆశ్రమంబు నిర్మించుకొనీ
ఆ దివ్యస్థలమునందు జేరుకొని
వకుళమాల ప్రశ్నించెగనీ
నాయన నీవెవ్వరి పుత్రుండవు
కాననముల నిటుజేరి
గాయముతో నిటు బాధపడుచు కడు
కలతజెందెదవు దెలుపు హరీ.

వ॥ అని నీ వృత్తాంతంబు జెప్పుమన స్వామి యిట్లనె.

పాట

అమ్మా మాయమ్మను బోలిన కొమ్మా
ఓయమ్మా నాకథ వినిపించెద వినుమమ్మా ॥అ॥
నేనొక అభాగ్యుడను సుమ్మా
నాకెవరులేరు ఇల బంధువులమ్మా ॥అ॥
భాగ్యలక్ష్మి విడనాడెగదమ్మా
బ్రతుకుభారమై బహువేషములన్
దాల్చి లోకజన రక్షణకమ్మా
పుత్రునిగా నను బెంచుకొను మమ్మా ॥అ॥

గీ॥ ఒక్కడేగాని జగమెల్లనుందు నేను
జనని జనకులు బాంధవు సమితిలేదు
తొల్లిగల లక్ష్మి దొలగె నాదురితమునను
రోయుచు దరిద్ర దామోదరుండనైతి.

వ॥ ఎన్నో కష్టములుపడి నేనీకొండమీదకు చేరితిని. కారణాంతరము వల్ల నొక గోపాలుడు నా శిరమున గొడ్డలివ్రేటున గాయపరచెను. నన్నాదరించు వారెవ్వరూలేరు. ఇప్పటికి నీవే నాతల్లివని వకుళాదేవి కన్నుల భాష్పములు వ్రాల్చి.

గీ॥ బిడ్డలుఁ దిక్కులేనట్టి గొడ్డురాలి
జేరితిని వరాహస్వామికి సేవజేయు
పుణ్యఫలమున నీవు నా పుత్రుడౌచు
లభ్యమైతివి శ్రీహరి దివ్యమూర్తి.

వ॥ నిన్ను నాకంటికి రెప్పగా కాపాడుకొందును. నేటి నుండి నిన్ను శ్రీనివాసయని పిలుచుకొందు నన్ను విడచి పోవలదు అని బుజ్జగించెను.

తోహర

శ్రీనివాసుడుఁ నవ్వి నేటికిన్ ధన్యుడనైతిని తల్లీ
యెన్నిజన్మల పుణ్యమొ అమ్మాయని బిల్చు భాగ్యమ్ముగల్గీ
నీకుమారుడను నిన్నువిడుతునా నాకన్నతల్లి నీవే
నాకిల నెవ్వరు నీకన్న వకుళానంద భాష్పములు రాల్చె.

వ॥ వకుళదేవి కడుప్రీతితో స్వామి తలపై గాయమున కడిగి వన మూలికలు దెచ్చి మందు వేయుచూ. మంచి మంచి ఫలములు కందమూలములు దెచ్చి శ్రీనివాసునకు ఆహారమిచ్చుచూ కన్నతల్లివలె పోషించుచుండెను.

గీ॥ పుత్రప్రేమను నావకుళ చిత్రమేమొ
శ్రీనివాసుకు పరిచర్యజేసి కన్న

తల్లికన్నను మిన్నగా ధన్యనంచు
చెలగు విధి చోళరాజు నా చంద్రగిరిని.

(ఆకాశరాజు జన్మకథ)

పూర్వము శేషాద్రి సమీపములో నారాయణపురమును రాజధానిగాచేసికొని సుధర్ముడు అనే చంద్రవంశపురాజు పాలించుచుండెను. అతనికిద్దరు కుమారులు పెద్దవాడాకాశరాజు, చిన్నవాడు తొండమానుడు పెద్దవాడైన ఆకాశరాజునకు రాజ్యపట్టాభిషేకముచేసి తపముకకు పోయెను.

తోహ:

ధర్మము నాలుగు పాదముల ప్రజాపరిపాలనముజేసీ
పుత్రకునకు రాజ్యాభిషిక్తుగా చక్రవర్తిగాజేసీ.

గీ॥ తనయునకు శకవంశపుత్రియౌ ధరణిదేవి
యనెడు కన్యనువివాహంబు నొనరజేసి
మిత్రవర్మయు భక్తుడై పత్నితోడ
తపమొనర్చియు వేంకటాద్రిజేరె.

వ॥ ఆకాశరాజు ధరణీదేవిగా గూడి రాజ్యపాలనము జేయుచు సంతానము లేక విచారించెను.

గీ॥ ఎన్నియో నోము వ్రతముల నెన్నోచెట్టు
గుట్టలకు మొక్కి దానధర్మాలు కొల్లగాను
దేవతా ప్రతిష్టలుగా జేసిరి కర్మమేమొ
సంతతియు లేక నెంతయు చింతనొందె.

వ॥ ఒకనాడు ఆకాశరాజు తన కులగురుడైన శుకమహాముని రప్పించి వారిని పూజించి గురువరా మాకెంతోకాలము నుండియు సంతాన వాంఛకలిగి తపించుచున్నాము. బిడ్డలలేని యిల్లు సన్యాసుల మఠమువంటిది గదా.

ఆది

కాలము వ్యర్థముగా గడచుచుండెను కటరిట సంతతిగాంచనై తిమిటు ॥కా॥
పత్ని ఇల్లాలు పరితపించెనే రాత్రిపవలు కన్నీరు మున్నీరుగ
హాళిం కొడుకులేని నా విభవము అడవిగాచు వెన్నెల చందమాయె.
ఏల యీగొడ్డుబ్రతుకు మాకింక ఇహపరంబులకు దూరమైతిమిటు ॥కా॥

వ॥ అని కన్నీరుగార్చి దుఃఖించు రాజునుగాంచి శుకయోగి కొంచెము యోచించి రాజా విచారపడకుము దైవకృపతో నీకోరిక దీరును.

తోహర

మున్ను దశరథుడు సంతానమునకై పుత్రకామేష్టి జేయా
ఘన ఋష్యశృంగు బిలచి వశిష్టుని అనుమతితో వృద్ధుండా
నల్వురు కొడుకుల బడసే గాన నీ ఇల్లాలిగూడి వేగా
జేయుమిక పుత్రకామేష్టి యజ్ఞము సంతానంబును గలుగా.

వ॥ పుత్రకామేష్టియాగంచేసిన నీకు తప్పక సంతాన భాగ్యము గలుగునని చెప్ప ఆకాశరాజు గురుదేవుని మాటలు విని సంతోషించి వారితో యజ్ఞ ముహూర్తము బెట్టించి ఆ ముహూర్తమున రాజా యజ్ఞముచేయు స్థలమును బంగరు నాగలిచే దున్నుచుండ నాగలికొక పెట్టె తగిలిన దానిని బయటికి దీసి తెరచి చూడగా.

గీ॥ పూర్ణశశితేజ స్వర్ణ పద్మమున నొక్క
బాలికామణిగాంచి భూపాలుడంత
సంతసముప పురిజేరి సంభ్రమమున
ప్రీతి పద్మావతీదేవి పేరుబెట్టె.

వ॥ ఆ సహస్రపుష్పముల నడుమ మెరపువంటి కాంతిగల చక్కని పసిబాల కన్పింప నందరాశ్చర్యమందిరి. ఆ సమయమున ఆకాశవాణి ఓ రాజా నీవు కడు పుణ్యాత్ముడవు నీజన్మతరించె. నీ అదృష్టంవల్ల నీ బిడ్డ లభించెగాన ఈ మెవలన మీవంశం పవిత్రమగును గాన పెంచుకొనుమని చెప్పెను.

తోహర

సద్బ్రాహ్మణ సంతర్పణములతో పద్మావతి సుత తోడా
సంతసమునుండ సుతుడుదయించెను సుదాముడను నామమిడా.

వ॥ ఆకాశరాజు ఆనందానికి అంతులేదు. ఆబాలికనెత్తి ముద్దాడి తన భార్య ధరణీదేవిచేతికిచ్చిన. ధరణీదేవి సంతోషముతో నా బాలను కన్నబిడ్డగా ప్రేమించెను. రాజు బ్రాహ్మణుల రావించి బిడ్డకు నామకరణము చేయుడన యోచించి పద్మములో దొరికినది గాన పద్మావతి అను పేరుపెట్టిరి. లక్ష్మీదేవియే మన యింట బిడ్డగా వెలసినదని సంతోషపడిరి.

(పద్మావతి జన్మవృత్తాంతము)

తోహారా

పూర్వకాలమున వేదమునిచేయు పుణ్యఫలనలో శిశువూ
బుట్టుటన్గాంచి వేదవతి యనెడు పేరుబెట్టె నామునియు.

గీ॥ ప్రేమతో బెంప నాబాల సీమమొప్ప
కృష్ణదేవుని పూజించు నిష్ఠశక్తి
పూర్ణచంద్రుని కాంతితో వీణబాడ
రావణుడుగాంచి దరిజేరి గర్వమునను.

ఖండగతి

మబ్బుచాటున తళుక్కుతళుక్కుంచు మెరపెనీ
మరుబాణనుమబాల మైమరచి పాడెనిటు
మరులు గొల్పించెనాకు బంగరుబొమ్మను బోలియు ॥మ॥
మగువను గూడకబోయిన మగతనమెందుకు నాకిల
తగు నాతియె దొరకెను తప్పక కూడెదనిల ॥మ॥

వ॥ వేదముని వేదపఠన ప్రభావంతో వేదవతి ఉద్భవించి లతా కుంజ ముల మధ్య రాతి తిన్నెపై వీణమీటుచు శ్రీహరిపై ధ్యాననిష్ఠయై పాట పాడు చుండ రావణుడామె గానమాధుర్య సౌందర్యములచూచి చెంతచేరి.

మ॥ బాలా నీమృదుగానమాధురిమచే నాభావంబు
నీరయ్యె నిన్నాలోకింపగ నాదు చూట్కులకు ఆ
నందంబు వర్ధిల్లెనీ నీలోద్యాన విహారముల్
గనగహాళింజెందె నాచిత్తమో లోలాక్షీ ఇ
కకాము బాలములకున్ లోజేయకే వేడెదన్.

వ॥ జగజ్జెగీయమాన బాహుబలుడ స్వర్ణలంక పట్టణమేలువాడ. దశకంఠ ధరుడ రావణబ్రహ్మను నీ యందచందములచూచి వరించి వచ్చితి. ఇంద్రాది దేవతలు సకలదేశ జీవులు నా దాసులు. నన్ను పెండ్లాడి నారాణివి గమ్ము.

తోహర

రావణుమాటలు విని వేదవతియు కోపము భయమున బలికెన్
రాకసరాజ నేను శ్రీహరిని దక్క నెవరి పెండ్లాడనికన్
ప్రాణములైన నను విడుతునేగాని వరింప నిక బొమ్మపలికెన్.

వ॥ శ్రీహరినిదక్క నితరుల వరింపనని శపథముచేసితి పొమ్మన. రావణుడు నవ్వి యవడా విష్ణుడు నాపేరువిన్న వానిగుండె కూలిపోవును. నన్ను నిరాకరించెదవానిన్ను బలవంతముగానైనా పట్టుకొని నాకోర్కె దీర్చుకొందునని సమీపించి పట్టుకొనబోవ. ఈ దుర్మార్గుని చేతిలో మానభంగము తప్పదనియెంచి.

గీ॥ ఓరి పాపాత్మ పర స్త్రీలజేరి నిట్లు
జెరుప బలవంతమున దుష్టదూరుడౌచు
అగ్నిలోబడు శలభమ్ము పగిది నీవు
వంశనాశన మగుమింక వనితవలనా.

వ॥ అని శపించి అగ్నికల్పించుకొని భగ్గునభగ్గున మండుచూ. రావణా నీకు నేను బిడ్డనై బుట్టి నామూలమున నీ పుత్రమిత్రకళత్ర వంశనాశనము చేయ

కున్న నే వేదవతిగానని. యోగాగ్నిలోబడి ఇమిడియున్నది. కొన్నాళ్ళకు రావణుడు సీతనెత్తుకొనిపోవుచుండ అగ్నిహోత్రుడు సీతను రక్షింపనెంచి రావణా నీవు తీసుకొనిపోవునది మాయా సీత. రాముడు నిజ సీతను నాలోనుంచినాడు. ఈ మాయ సీతను వదలి నిజసీతనిత్తును గొనిపొమ్మన. రావణుడు నమ్మి సీతను విడచి అగ్నిహోత్రుడిచ్చిన వేదవతే సీతనుకొని గొనిపోయెను. నిజ సీతను తనలో దాచెను.

సీ॥ కౌసల్య సుతుడయ్యు కౌసికయాగంబు
  గాచి తాటకగూల్చి రక్కసుల ద్రుంచి
రాతినాతిగజేసి రహి శివుని విల్లుద్రుంచి
  భూపుత్రి గొంచు భార్గవుని నొంచి
జనకాజ్ఞ పాలించి ఘనకురంగముగూల్చి
  ఖరదూషణుల జంపి హనుమగలసి
శబరి రాక జటాయు లవని మోక్షంబిచ్చి
  వాలిజంపి సుగ్రీవు నేలెరాజు.

గీ॥ వీర కపికోట్లతోడ సాగరము దాటి
దుష్ట దశకంఠ దనుజాళి ద్రుంచివైచి
రహి విభీషణు లంకకు రాజుజేసి
సీత వెతదీర్చి రాముడయోధ్య నేలే.

వ॥ రావణ వధానంతరము రాముడు సీతను అగ్నిప్రవేశముచేయించెను. అగ్నిలో మాయసీతయైన వేదవతి దూకెను. ఆకారణమున నిజమైన సీతయు వేదవతినిద్దరి అగ్నిహోత్రుడు తెచ్చి శ్రీరామున కర్పించి వేదవతి కథ విన్పించి యీమెను కూడా పెండ్లాడుమన రాముడిట్లనియె.

తోహేరా

వక్కవాణమ్ము వక్కటేమాట ఏకపత్నీ వ్రతంబు.
శీఘ్రమె ద్వాపరాంతము కలియుగమున జేకొందు వేదవతి న్నిజము.

గీ॥ అనుచు వరమిచ్చె నాకారణంబుచేత
వేదవతి రాజపుత్రియై యుద్భవించె
కధను విన్పించె మునులకు సూతమౌని
వినుడు పద్మావతి యదృష్ట భాగ్యరేఖ.

(నారదుడు పద్మహస్త సాముద్రిక చెప్పుట)

వ॥ దినదిన ప్రవర్తమానయై శుక్లపక్షచంద్రునివలె ప్రకాశించు పద్మావతి పశ్రప్రసాదమున గల్గిన బిడ్డగాన. గురువులవద్ద సకల విద్యలు నేర్చెను. దిన దినాభివృద్ధిగా.

తోహర

పదునాలుగేండ్ల ప్రాయము వచ్చిన రతీదేవి చక్కదనము
పార్వతివంటి పవిత్రత లక్ష్మీవంటి అందచందమ్ము.

గీ॥ అందమునకు తగువయసుకు విద్యతగును
విద్యకును దగిన వినయంబు మించుకీర్తి
గౌరిపూజించి నాడు చెలికత్తెతోడ
ఆటలాడగ నారదుడామె జేరి.

వ॥ ఒకనాడు పద్మావతి గౌరీపూజజేసి చెలికత్తెలతోగూడి అంతఃపురములో నాడుకొనుచున్న సమయమున భగవన్నామ సంకీర్తనజేస్తూ నారదముని వచ్చెను. పద్మావతి భక్తితో నారదముని కెదురేగి తీసుకవచ్చి యుచితాసనమున కూర్చుండబెట్టి పన్నీటపాదములు కడిగి. కనుల కద్దుకొని భక్తితోపూజింప. నారదముని పద్మావతిదేవి భక్తికి సంతసించి. అమ్మా నీకు మేలుచెప్పవచ్చితినీ చేయిజూపుమన. పద్మావతి సిగ్గుపడి కాదనలేక దగ్గరగాబోయి తన ఎడమ చేతిని జూపింప నామె చేతిలోని శుభలక్షణ సంపన్న రేఖలజూచి. ఇవి మానవ మాత్రులకు ఉండవని ఎంచి. అమ్మాయీ రాకుమారీ.

సీ॥ నీహస్తములు పద్మినీ రేఖలున్నవి
అందు రేనా పూర్ణచంద్ర యోగము

కనులు దామరపువ్వు చెక్కిళ్లు అద్దమ్ములు
అధరమ్ము దొండపం డద్భుతమ్ము
పలువరుస ముత్యముల్ నీలముల్ నీకురుల్
విల్లనుసు కనొబొమల్ మెఱుపుమేను
పసిమి బంగారమ్ము పరికించి కరిగించి
బ్రహ్మదేవుడె నిన్ను బొమ్మజేసె.

గీ॥ సర్వలక్షణముల ప్రకాశింపజేసి
లక్ష్మికళల ప్రకాశిని౽ అచ్చిమగడె
పెండ్లియాడు నిదియదార్థ మనుచు బల్కి
చింతవడు నాకాశరాజు చెంతజేర.

వ॥ పద్మావతీదేవికి పెండ్లియీడు వచ్చినదని ఆకాశరాజు, ధరణీదేవి అమ్మాయికి తగిన వరుని చూడాలని బ్రాహ్మణులను దేశదేశములకు బంపి. అనేక రాజకుమారుల చిత్రపటములు తెప్పించి జూపించినా ఆమెకు నచ్చటం లేదు. పద్మావతి సాటిలేని సౌందర్యవతి అని తనయకు తగినవాడు లభింప లేదని విచారించుచుండ నారదముని రాగానే.

తోహర

అర్ఘ్యపాద్యాది పూజలర్పించి నారాజు వంతతోడా
ఏమందుమౌని పద్మావతికి౽ పెండ్లియీడు వచ్చెను నెచటా
తగినవరుడు లభియింపకుండుటచే ధరణిదేవియు౽ ఏను
తపియించుచుంటి త్రిలోకసంచారివి చెప్పుమంచు వేడగను

గీ॥ పుత్రికిని తగిన గుణశ్రీరూపుండు భాగ్య
శాలి బలయుతుయోగ్యుండు శాంతమూర్తి
శౌర్య ధన మహిమాన్వితుండు సారసాక్షు
డైన రసుతుడెందేని యున్నచెప్పు.

వ॥ పద్మావతికి ఆమె అందచందములకు సరిదూగువాడు ఎంతమంది రాకొమారులను జూచినను నా మనసు కొక్కరును నచ్చలేదు. మీరు త్రిలోక సంచారులు గాన మా పద్మావతికి తగిన భర్తను జూపి పుణ్యము గట్టుకొనుడని వేడ.

ఆది—మోహన

చింతిలబోకుము ఓరాజా శ్రీకాంతుని కృపచే శుభము గల్గునిక ॥చిం॥
వేదవతికి భగవంతుండిచ్చిన వరమువలన నీపుత్రిగ దొరకెను ॥చిం॥
అ॥ శ్రీమహావిష్ణువే పెండ్లాడును
శ్రీఘ్రములో కళ్యాణం మబ్బును
శ్రీనివాసుడే నీకు యల్లుడై
కన్నెనేలు కన్నులపండువుగా. ॥చిం॥

వ॥ రాజా అల్లునికై వెదక నవసరములేదు. మీ పద్మావతి లక్ష్మీదేవి అంశచే పుట్టినది. పూర్వం వేదవతికి భగవంతుడిచ్చిన వరంవలన ఆవేదవతియే నీ కొమార్తెగా లభించినది, ఈమెను శ్రీమహావిష్ణువే పెండ్లియాడును. ఆ శుభ సమయం త్వరలోనే లభించును విచారింపక ధైర్యసంభ్రమముతో నుండుమని చెప్పిపోయెను.

(శ్రీనివాసుడు వేటకుబోవుట)

సీ॥ శేషాచలంబున శ్రీనివాసుడెంతో
సంతోషమున వకుళ సేవజేయ
షడ్రసోపేతమౌ జ్యొంటి తేనెపలాది
బహు పదార్థముల సాపడుచుహాయి
నుండి యొకనాడు వేటాడగానెంచి
తన కోరికను వకుళదేవితోడ
దెల్పభీతిజెంది దీనయై వలదన్న
సుకుమారుడవు నీవు సృక్కిపోదువు.

గీ॥ అనగ విని నవ్వి శ్రీనివాసునికు భయమేమి
నీకొమరుని ప్రతాపంబు నెరుగవమ్మ
క్రూరమృగముల చెల్లాట కూర్మివేట
లాడివచ్చెద ఆశీర్వదింపుమమ్మ.

వ॥ శేషాచలమందు వకుళాదేవిజేయు ఉపచారములలో శ్రీనివాసుడు హాయినుండి. ఒకనాడు వకుళాదేవినిచేరి అమ్మా నాకు వేటాడ నుత్సాహమైనది గాన ఆశీర్వదించి బంపుమన తల్లిశిరము దువ్వుచు నాయనా క్రూరమృగాలన్న నాకు భయము సుకుమారుడవు దయ్యా యన. అమ్మా నాబలము నీకు తెలియుమి క్రూరమృగాలు నన్నేమి చేయజాలవు త్వరగ ఆశీర్వదించి నన్ బంపుమమ్మా యన.

తోహర

శ్రీనివాసు డాశీర్వాదమ్ముగొని శస్త్రాస్త్రంబుల గొనియు
ధనుష్టాంకారములచే ఘోరారణ్యమున వడిన్ బడియు
గండభేరండ కుంచాలంబుల జెండె చండార్కు డనగా
కొండ గుహలు దద్దరిల్ల ధనుష్టాంకారమున దిశలదరగా

వ॥ శ్రీనివాసుడు వేటకు తగిన వస్త్రములు ధరించి, చేత విల్లునూ అమ్ములునుగొని వకుళాదేవి ఆజ్ఞనుగొని శేషాద్రిదిగి ఘోరారణ్యమున ప్రవేసించి ధనుష్టాంకారముచేయ ఆ ధ్వని పిడుగులు పడినట్లు అరణ్యమంతా మారుమ్రోగి ఆ భయంకర శబ్దమునకు అడవిలో సింహాములు ఏనుగులు పులులు లేళ్ల మొద లగు జంతువులు భయపడి తమ స్థానములు వదలి చెల్లాచెదరై పరుగెత్తు చుండెను.

గీ॥ శ్రీనివాసుడు వదునైన బాణములతో
సింహముల నేనుగుల పులుల చెండివైచి
హరిణముల అడవి పందుల హతముజేసి
అల్లకల్లోలముగజేసె నడవినెల్లన్.

లోహర

ఆస్థవి నొక ఏనుగు ఘీంకారము జేసినన్ దాన్జెంటా
శస్త్రములతోడ శ్రీనివాసుండు తరుముచు వెదకెవెంటా.

గీ॥ గజము భయపడి నడవి నదృశ్యమాయె
హరియు అలసటజెంది దాహంబుతోడ
నీరముల జాడకై తిరిగి దూరమందు
జూచె నొకపుష్పవన కొలను చోద్యముగను.

వ॥ ఘీంకరించిన ఏన్గు వెంటబడ శ్రీనివాసునిజూచి పర్వెత్తి కంటపడ కుండా పారిపోయెను. శ్రీనివాసుడు తిరిగి పేసారి దప్పికతో నలుదిక్కులు వెదకుచూ నీరు త్రాగబోయెను.



(పద్మావతి వనవిహారం)

తోహర

ప్రియసఖులను తనవెంట బెట్టుకొని పద్మావతి యొకనాడు
ఉద్యానవనమునకు విహారముగ కన్యకామణులుగూడి



గీ॥ జాజి విరజాజి సంపెంగ చంద్రకాంత
మల్లె చామంతి వజ్రాంగి పొన్నపొగడ
మధురమందార అరవింద మదనచూత
కేతకీరోజ పద్మసుగంధి కుసుమ
వాసనల్ వెల్లవిరిసి ఘుమాయించె గాలి.

వ॥ పద్మావతీదేవి తన ప్రియసఖులతో పట్టణ సమీపమునవున్న ఉద్యాన వనవిహారము చేయుచూ. అందరు కన్యలు పూలమొక్కల పాదుల సరిచేస్తూ. అంట్లు కట్టుచూ లతల పైకెగబ్రాకించు సాధనముల చేయుచూ జలయంత్రముల నుండి నీరు పాదులలోనికి పంపుచూ, అనంతరము జల్లని కొలనులో జలక్రీడ

లాడి. పడ్డుచేతి తియతీయని పండ్లుదిని. పువ్వులలోని మకరందము ద్రావి. నుయ్యలనూగి పూలమాలలు కట్టుకొనుచూ. వీణమీటుచూ పాడుకొనుచుండిరి. తన ప్రియసఖులతో పద్మావతీదేవిట్లు చెప్పెను.

పాట—ఆది

కలగంటి నేనొక్క కలగంటినే రాత్రి ॥క॥
కలలోన వలరాజుకన్న సుందరరూపుని ॥క॥
సిరసిరశశ్యాము నిర్జర రవితేజు
శరచాపధరుడైన చిరునగవులవాని ॥క॥

అ॥ ప॥ హరిహర బ్రహ్మేంద్రాది సురవరులు
సరిబోలరు సుందరమూర్తి చెంత
కరములకా పొడవు విశాలవక్షము
ధరనడుము సింహకిశోర మధ్యము ॥క॥

గీ॥ సిగ్గువిడియంబు చిరునవ్వు చిందులాడ
సఖియతో పద్మకలజెప్పు సమయమందు
శ్రీనివాసుడు దప్పికన్ వనముజేర
ముదితలందరు దాగుడుమూతలాడె.

సీ॥ వనకోకిల యొకర్తు తనరాణిజాడకై
కూహూయటంచవి కూయుచుండె
చెలిగూడి యాటకై నటకు చేరినపద్మ
కోకిలగతి తాను కూసెననుచు
అంత నవ్వని నడయాడు శ్రీహరి పద్మ
కూతను విని తాను కూసెబదులు
కూయని పద్మయు కూయటంచు నతండు
కూయుచు నొక్కచో గూడిరంత.

గీ॥ వండొరుల గాంచి ఆశ్చర్యమంది పద్మ
సిగ్గువడి వేగజేరనా చెలుల వెనుక
నిలచె శ్రీ శ్రీనివాసుండు నెలతల దరిని
మాలతి ఇదేమిటనే చిత్రమంది మదిని.

వ॥ కోకిలలు కూసినట్లు కూసికొనుచూ. దాగుడుమూత లాడుచుండ శ్రీనివాసుడుకూడా కోకిలకూత కూయుచూ పద్మావతిచెగ్గర చేర. కనులకట్టిన గంత వల్లకనిపించక చెలి మాలతనుకొని పద్మావతి శ్రీనివాసుని గట్టిగా తన బాహువు లతో బంధించె అమ్మదొంగా దొరికావని కళ్ళగంతలు విప్పిచూడ శ్రీనివాసుడు కన్పింప సిగ్గుతో పరుగిడి తన చెలుల చేరెను. పద్మనుచూచి.

ఖండగతి—హంసధ్వని

క్రొక్కారు మెరుగులాగున తళుక్కున మెరసె
ఇక్కటికి కనులు బంగరు కమలముల దోచె. ॥క్రొ॥
యీపె వనలక్ష్మియో ఏరాజు కూతురో
యంతయును నన్ను భ్రమయించె నిటుచల్కనగ ॥క్రొ॥
కెంబెదవి గరచుకొని క్రీగంటచూపుతో
గాలమున నామనసు లాగుకొనె నెవ్వతియో. ॥క్రొ॥

సీ॥ రాహువునకునోడి రాకేందుబింబంబు
నతిమోముగామారి సౌఖ్యమంచె
చీకటుల్ సూర్యుని ఢాకకోర్వగలేక
చెవి కురులుగమారి చింతమానె
స్థిరుడుకాడని రవి వర పద్మములు కాంత
కనులై సదానందమున మెలంగె
ఉప్పునీటనుబడి యుండలేక పగడము
లింతిమోవిగ మారి ఇంపుగాంచె.

గీ॥ కనకమగ్గికి భయపడి తనువు నొచ్చె
గాలికిన్ వెరచి అరటులంకముల జేరె
ఔర యీరామ ఘనస్వరూపాభిరామ
భువన మోహిని రత్నమీ ముద్దుగుమ్మ.

గీ॥ దేవకాంతలు నీపద్మదేవి కాలి
గోటికైనను జోలరు సాటియంద
మెందుజూచి యరుంగ నోసుందరాంగి
పొందగాలేవి జన్మంబు బుట్టనేల.

తోహర

మందస్మిత వదనారవిందుడై సుందరీ నీవెవ్వరివో
సంఢియమేటికి దెలుపుమన పద్మగద్దించి పల్కెనిటు
చంద్రవంశజు డాకాశరాజు సత్పుత్రి పద్మావతీదేవి
వన విహారంబుచేయు వాంఛతో వచ్చితిమి సఖీయుతమై.

గీ॥ రాణివాసము విహరించు రాజపుత్రి
నుండు వనమును జేరితి వెవండనీవు
చూచిరా రాజభటులిపుడె నిను బంధించి రాజ
దండములతోడ శిక్షింత్రు తడయకేగు.

వ॥ రాజభటులు చూచిరా నిన్ను బంధించి రాజాజ్ఞతో చిత్రవధచేతురు వెంటనే పొమ్మన శ్రీనివాసుడు చిరునవ్వు నవ్వుచూ దగ్గరగాజేరి.

గీ॥ తరుణి నీవాలు చూపుల మురుపుజూడ
మరుడు విరహాన ముంచెనే మందగమన
తరమె నీరీతి కేళనన్ జేర్చుకున్న
ప్రాణములు నిల్చుటిక సున్న పదములాన.

వ॥ పద్మావతీదేవిని చూచుచూ నిన్ను విడచిపోవుటకు నాకు కాళ్లాడ కున్నవి. నా మానసము తస్కరించిన చోరశిఖామణీ నిన్ను పెండ్లాడ నా మనసు తహతహపడుచున్నదన. రాజపుత్రి కోపించి ఓయీ అడవి కోయవాడా. నీ మాటలు మితిమీరిచున్నవి.

ఆది—మోహన

పూరుపేరు నెరుగని చోరుడవై మీరి మాటలాడుచుంటి వౌరా ॥పూ॥
ప॥ కొరవితోడ నెత్తిగోకుకొనునటు క్రూరబుద్ధిజూపకుము పోపొమ్మిక ॥పూ॥
అ॥ రాజశాసనంబు ధిక్కరించియు రాజపుత్రితో బీరములాడుమ
రాజులేడ కోతువాడవేడా బ్రతుకబొమ్ము ప్రాణములు దీతురిక ॥పూ॥

గీ॥ ప్రాణముల ఆశయున్నచో పారిబొమ్ము
బ్రతుకి జలుసాకు తినియైన బ్రతుకవచ్చు
వచ్చెనా రాజు తలలు ఖండించి జంపు
దండధరుమించు భటులొచ్చు కొండరేడా.

తోహర

నిక పోబొమ్మను నంత మదగజము ఘీంకరించుచును వేగా
నక్కన్యామణులెల్ల భీతిబడ నాగ్రహమున వడిరాగా.

వ॥ ఇంతలో వక మదగజం ఘీంకరించుచూ రాగా చెలులందరూ భయ భ్రాంతులై దిక్కుకొకరు పరులిడుచుండ నా ఏనుగును శ్రీనివాసుడు చూచి వెంటనే తన ధవళాశ్వమునెక్కి పరుగులిడుచున్న మదగజమువెంట తరుముచూ.

గీ॥ దెసలదర ఘీంకరించుచు దంతకాంతి
చేట చెవులను నూపుచు తుండమెత్తి
జనుల ఆబలల భయమందె జేసినింక
నెందు బోదువు గజరాజ నిల్వు గూర్తు.

వ॥ వెంటనే ధవళాశ్వరూఢుడై ధనుర్బాణములతో వెంటనంటిన శ్రీనివాసుని దివ్యమూర్తిని చూచి గజరాజు ముందున్న పాదములు తొండము పైకిలేపి రవముచేసి శాంతముగా నమస్కరించి శిరమువంచి మాయమయ్యెను. ఆ చిత్రము పద్మావతిజూడ.

గీ॥ కోటిమన్మధ రవితేజు బోటిజూచి
కనులు చెదరియు ఆశ్చర్యమును జెలంగ
శశిర సుందరు డితడు సామాన్యుడౌనె
యెచటనుం డిటకొచ్చెనో నెవరివాడో.

వ॥ పద్మావతీదేవి తన సమీపమునకు వచ్చుచున్న శ్రీనివాసునిచూచి ఏమే చెలీ మీరువెళ్ళి ఆ వచ్చుచున్న పురుషుడెవరో ఇచటకేల వచ్చెనో కనుగొని రండని పంపెను. చెలికత్తెలు శ్రీనివాసునకెదురేగి అయ్యా నీవెవ్వరు మీదే దేశము తమ పేరేమి ఇచటకేల వచ్చితిరని అడుగ శ్రీనివాసుడు కాంతలార మీ రడిగిన ప్రశ్నలన్నిటికినీ మీ రాజకుమార్తెకు స్వయముగా నేనే సమాధాన మిత్తును రండని సమీపించిట్లనెను.

సీ॥ అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకు డీత
డనిలోకమున కీర్తినందినాడ
ఆదిమధ్యాంతహీ నాత్ముడీతండని
మునులచే మ్రొక్కులు గొనినవాడ
శరణాగతానేక శరణుడీతండని
యురుతర విఖ్యాతినందినాడ
బ్రహ్మాది దుర్జయ పటుతర మాయా ప్ర
భావంబున న్సదా బరగువాడ.

గీ॥ ప్రబలతర శంఖచక్ర గదాబ్జశార్ఙ్గ్య
క్రమ కౌస్తుభ వనమాలికా ధరుండు
ఘనత వసుదేవ దేవకీ గర్భజలధి
సోముడను కంజనేత్ర కృష్ణుండ సుమ్మ.

మంజరి

కుముదహితాన్వయ వశిష్ఠగోత్రుడ కోటియనంత నాముండా
తమ్ముడ బలదేవునకు సుభద్రకు నమ్ముడునే నగ్రజుడా.

గీ॥ వేంకటాద్రి నివాసినై వీరపతిగ
తిరుగుచుంటిని రక్షింప దీనజనుల
వర్ణమున నీలవర్ణుండ వకుళ నన్ను
శ్రీనివాస కృష్ణాయంచు చేరబిలుచు.

వ॥ సుందరీ నేనొంటివాడను ప్రస్తుతము నాకు చుట్టము లెవ్వరూలేరు. పూర్వము నాకొక నివాసముగలదు గాని, ఇప్పుడన్నిదేశములు నావే. నేకొన్నాళ్ళ క్రిందట లక్ష్మీ నంపన్నుడను కాని, ఇప్పుడు లక్ష్మి నన్ను వదలిపోయినందువల్ల దరిద్రుడనై నాను. నావర్ణము నీలవర్ణంబు నీపేరేమి తలిదండ్రులెవరు అన.

వ॥ పద్మవిని నవ్వుచుండు మాలతీ పద్మావతిదేవితో నిట్లనె.

ఉ॥ దేవకియంటతల్లి వసుదేవుడు తండ్రియెయంట మున్ను శ్రీ
దేవికి భర్తయంట తనుతీరగుమాట వచించెదే భళా
భావమునందుమెచ్చి నిను పద్మ గ్రహించునె నీదునల్పుకున్
యీవెడ దేహకాంత సరియేయని పక్కననవ్వి యిట్లన్.

గీ॥ చంద్రవంశోద్భవుడు పూర్ణచంద్ర హృదయు
డైన ఆకాశరాజే యీయతివ తండ్రి
ఈపెపేరిల పద్మయె నీమెచెలిని
విగతభవతృష్ణ శ్రీ వేదవేద్య కృష్ణ.

వ॥ నాతండ్రి ఆకాశరాజు. తల్లి ధరణీదేవి నాపేరు పద్మావతి అనిచెప్పి నీవు యిచ్చటనుండి త్వరితముగా వెడలపొమ్మన్న. శ్రీనివాసుడు నవ్వుచు.

మంజరి

అఖిల నీచక్రాదనము జూపినే అకట మరచిపోజాలా
యమ్మామహావిష్ణు వైకుంఠము విడిచిన యామహాలక్ష్మి వేవెయ్యేలా.

వ॥ నామనస్సు కెంతయో ఆనందముగానున్నది. నిన్ను మనసారా ప్రేమించాను. నన్ను పెండ్లియాడుచున్నాడు వేటగాని ప్రేమవాక్యాలువిని పద్మావతీదేవాగ్రహింప అంతలో సేవకులువచ్చి.

మంజరి

అమ్మపద్మ మీ తండ్రి యాకాశరాజు పిల్చెనె నంచు
కొమ్మలు పిలువగ రాకుండెను రాకొమరి శోకమె మరచూ.

గీ॥ శంఖచక్రగదా పద్మచాపహస్త
దివ్యనవకోటి మన్మథా తేజుడగుచు
పద్మనేత్రికి కాన్పింప పారవశత
మూర్ఛనద పుష్పపాన్పుపై ముగ్ధవాలెను.

మంజరి

అంత సఖులు చింతజెంది వంతచె హరిజూచి నాగ్రహించి
మంత్రమొ తంత్రమొజేసె కోయవాని మగువలు గొట్టిరి రాళ్ళచే

గీ॥ రాతిదెబ్బలచే అశ్వరాజములను
బడియె పద్మయు మేల్కాని నేడ్చునంత
హరియు శ్రీహరినంతలో నదృశ్యులయ్యె
పద్మనేత్రికి ప్రభుడు సాక్షాత్కరించె.

నాట

నాలీలలు గనజాలరెవ్వరు నామాయల తెలియంగ జాలరే
బాల నీమదిని జాలిగుంపకే బేలవెయ్యేల నిన్నే నేనేల

ఖాగేశ్వరి పలుమారు నినున్ గాంచి
మించుప్రేమను కౌగలించనైతి
శంకరాభరణ సూచక తుల్య నీకురుల్
నవ్వుచు నొకసారి దువ్వనైతి
గీ॥ నాదనామ క్రియాశాలి నళిననేత్రి
చక్రవాక కుచద్వయాంచల విధాన
ఘనత శ్రీరాగయుక్తి సంకలితలేమ
సుగుణ భూపాలసుత నిన్ను చూడనైతి.

మంజరి

అన్నయాహార ఫలపానీయములైన గొనక విరహమునన్
నున్న శ్రీశుగని దుఃఖమున వకుళ విన్నవింపుమని శ్రీశుగనెన్.

వ॥ అంత వకుళాదేవి శ్రీనివాసుని గని ఇట్లనెను.

గీ॥ పూర్ణచంద్రుని మించు నీమోము నేడు
కాంతి కళహీనమైనిట్లు శాంతిలేక
గాయములతోడ మూల్గుచు రోయనేల
కారణంబేమొ చెప్పుమా కన్నతండ్రీ.

వ॥ ఆనందముగా వేటకుబోయిన శ్రీనివాసుడు విచారముతో వచ్చిన వాని జూచి వకుళాదేవి దుఃఖముతో దగ్గరజేరి నాయనా శ్రీనివాసా నీకేమిబాధ గల్గినది తల్లినైన నాకు చెప్పక దాచెదవా. నీ శరీరమునిండా యీ గాయము లేమి. ఎవ్వరు నిన్నుకొట్టిరో చెప్పుమన శ్రీనివాసుడొక్కమాటైనా పలుకకున్న జూచి.

ఖండగతి

మార సుకుమార నీ ఘోర బాధనుజూచి
నోర్వజాలర నాయనా నోరారగదెల్పర ।మా।
ఏ క్రూరచిత్తు లిటు నీర క్తగాయములతో
నిన్ కొట్టి నొప్పించెరా నాకడుపు రంపకోతగ ।మా।

నిక్కము జెప్పుము తడయక దక్కవు నా ప్రాణంబులు
అక్కటకట రామా అలకమానిరావా. ॥మా॥

వ॥ కుమారా నేనింతగా అడుగుచున్నను ఒక్కమాటైనా పలకకున్నావు. నీకష్టసుఖములు తల్లినైన నేను వినకూడదా నీ విచారమునకు కారణమేమో తెల్పుము అనెను. శ్రీనివాసమూర్తి వకుళాదేవితో అమ్మా తల్లివైన నీవద్దదాచు టెందుకు వినుము చెప్పెద.

సీ॥ వేటకేగియు క్రూర యడవి మృగంబుల
వేటాడ దాహమ్ము వేసెనమ్మ
దాహశాంతికి నొక్కయుద్యాన వనమున
జల్లని కొలను నీర్ ద్రాగితమ్మ
పూలవాసన లల్లిబిల్లిగా నల్కొన్న
లతల నీడసుహాయి నందితమ్మ
ఆక్షణంబున నచట ఆకాశరాజసుత
సఖులగూడి విహారము చేసెనమ్మ.

గీ॥ అపుడు తొలకరి మెరుపట్లు అబ్జనేత్రి
పద్మవతి సుందరిని చూచి మదివరించి
మనసు మరువగలేక నేపరితపించి
విరహ తాపానబడి ఇట్టులుంటి నమ్మా.

వ॥ వనవిహారమునకు వచ్చిన ఆ సుందరాంగిని చూచి నన్ను పెండ్లాడు మన. రాళ్ళతో కొట్టించినది. నేను మారుమాటాడక బాధచే తిరిగి వచ్చితినిగాని యామెను పెండ్లాడకున్న నే బ్రతుకజాలను.

ఉ॥ జూచితి నిర్జరాంగనల సుందరి నింద్రుని రాణిజూచితిన్
జూచితి నాగకన్నియల సుందరయక్ష సరోరుహాక్షులన్
జూచితి దేవకామినుల జూచితి రోహిణి చంద్రకాంతలన్
జూచితిగాని దీని సరిసుందర రూపములేదు నెచ్చటన్.

వ॥ అందరికన్న అందమున మిన్నయైన పద్మావతీదేవని చెప్ప. వకుళ దేవి భయమంది. మహారాజ పుత్రియా.

చతురశ్ర

చతురంబోధి పరీత భూవలయ సామ్రాజ్యపాలనా దక్షదేవ
బ్రతుకు తెరవులేని పేద ఆశ్రమవాసులేడ సుకుమారి సుతయేద. ॥చ॥
మి॥ అతుల ఐశ్వర్య భోగిభాగ్య శంపత్స్వర్ణదాసి టూగుటుయ్యాల
మృదుమధుర అమృత పదార్థములతో నోలలాడు పసిడిబాలయేదా. ॥చ॥
వ॥ గత్పదరిద్రుఃకు రాచబిడ్డను యిస్తారా నాయనా నామాట విని ఈ
కోర్కెమానుకొనుము.

తోహర

కయ్యము నెయ్యము వియ్యంబులతో నెయ్యెడసరిదూగెదము
నీయడియాశలు మాని సుఖమ్మున నింట నుండరాబాబు
అని భీతిలి బుజ్జగించుతల్లి నిగని శ్రీనివాసు నవ్వీ
గుణముకులము దేహబలము వీరత్వమున్న చాలదే క్రొవ్వీ
ధనధనేతరైశ్వర్యము శాశ్వత మనరు సజ్జనులు పృథ్వీ.

గీ॥ మాత సర్వజ్ఞుడగు రాజుపత్నితోడ
కన్యకామణి నెట్లయిన కన్యాదాన
మిచ్చి పరిణయమును వేగ నిశ్చయించి
సమ్మతిగజేసి శుభవార్త జెప్పుమమ్మా.

గీ॥ అనుచు భీతిల తన పూర్వజన్మదెల్పి
నందునిల్లాలివి యశోద నన్నుబెంచి
బోయవేటునబడ పుత్ర ప్రేమతోడ
కోరితివి కొడుకుగా నన్ను కూర్మితోడ.

తోహర

ద్వాపరాంతమున తల్లి యశోదవు గోపబాలుడనౌయమ్మా
వాడిశర కిరాతుడు నన్నుగొట్ట నేడ్చి ననుజేరితమ్మా
పుత్రప్రేమ దుఃఖమందు నిన్నని పుత్రునిగ చేరితినమ్మా.

వ॥ శ్రీనివాసమూర్తి నవ్వుచూ అమ్మా నీకొక రహస్యము జెప్పెద వినుము. పూర్వము నేను రామావతారమునందుండగా నా సీతను రావణాసురుడు ఎత్తుకొనిపోవ నే వానితో యుద్ధమొనర్చి వాని సంహరించి మరల సీతను తెచ్చు కొనునపుడు సీతారావణు లంకాపురి పట్టణములో కొన్నాళ్ళున్నందున ఆమె శీలము లోకము శంకిస్తుందని సీత నగ్నిప్రవేశము చేయించితిని. ఆ అగ్నిలో నుండి ఇద్దరుసీతలు కన్పించిరి. అంత అగ్నిహోత్రుడు వారిద్దరిని నాకు చూపి యీ యిద్దరిలో ఒకతె వేదవతి యామెనే రావణాసురుడు తీసుకొనిపోయె. జనిమైన సీత తనవద్దనే యున్నదనిచెప్పి నాకర్పించెను. అప్పుడు సీత నాథా నాకొరకు యీమె రావణాసురు చెరలో బాధపడినది. గాన యీమెను కూడా మీరు భార్యగా స్వీకరించుడని కోరినది నేను దేవీ నేనీయవతారమున ఏకపత్నీ వ్రతుడ ముందు కలియుగంలో ఈ వేదవతి పద్మావతిగా పుట్టును అపుడు నేనీమెను పెండ్లాడుదునని వరమిచ్చియుంటిని. ఆకారణంచేత ఈ రూపముతో భూమికివచ్చితిని. ఆ వేదవతి పద్మావతిగా ఆకాశరాజుకు లభించినది. కనుక నేనామెను వివాహమాడవలసి యున్నదని పద్మావతి వృత్తాంతము వకుళాదేవికి శ్రీనివాసుడు విన్నవించెను.

మంజరి

పూర్వజ్ఞానమునిచ్చి తల్లికిఁ సర్వము తావినిపించి
నారాయణపురముజేరు జయమగు కార్యము ఫలించునంచు.

వ॥ కోయవానివేషములో నున్నందువల్ల పద్మచూచి ఎవడో వేటకాడని నన్ను రాళ్ళతో కొట్టించినది గాని నేను శ్రీహరినని నిజరూపము జూపియున్న వెంటనే పెండ్లియాడకయుండునా. ఎంత పొరబాటు చేసితినన వగచి ఆ రాత్రి గడపి ఉదయాన వకుళాదేవిలేచి స్నానసంధ్యానిష్టలు తీర్చుకొని శ్రీనివాసునకు సుప్రభాత మేలుకొలుపుజేసి.

(సుప్రభాత పద్యములు చదవాలి)

వ॥ వకుళ శ్రీహరిని మేల్కొల్పి నాయనా నీవు దిగులొందకు ఆకాశ రాజు నొద్దకుబోయి పెండ్లి వప్పించి వత్తునని చెప్పి నారాయణపురమునకు ప్రయాణము సాగించెను.

(పద్మావతి ప్రణయ వేదన)

పాట

కనులు మూసినా కనులు తెరచినా కనుపించే నతని సొగసే
మనసు మరులతో మురతుమన్నను మరువజాలనే చెలియా
మనసు దెలుప కన్నతల్లితండ్రులు మనకుదగునె యావికారి యల్లుడు
మరచిపొమ్మి మతియాద గాదనుచు బాధగ్రహింపక పలదు జడుడండ్రు.

వ॥ తలిదండ్రులు అతని సంబంధము సమ్మతించరు ఇక తన కోరిక సఫలమగుటెట్లని మనసు మరలించుకొనుటకు నెంత ప్రయత్నించిననూ సాధ్యము కాలేదు. నిద్రాహారములకు దూరమైనది చెలికత్తెలతో పలుకుటలేదు. శృంగారించుకొనదు. వనవిహారము మాని ప్రేమావస్థలో క్రుమ్మి జ్వరముతో శరీరము నుండుచున్నది కనులుమూసి పెచ్చిగా కలవరించుచున్నది.

గీ॥ మదన పీడితమైమనోవ్యాధితోడ
కలవరించు శ్రీనివాసుని కనులు మూసి
పలుకరించిన పలుకని బాలగాంచి
తల్లిదండ్రులు గనినెంతో తల్లడిల్లె

మంజరి

రాజవైద్య భూతవైద్య మందులుబోసి మంత్రయంత్రాలు వేసిన
వ్యర్థమాయె ఆమె మనోవ్యాధికి మందులేమి పనిచేయవక్కటా.
ఏమని యూహింతుము నీవ్యాధి ఇంకేమని తలపోతుమో ఇకేంమి సేతుమిక

గీ॥ దైవకృపతోడ దక్కెనీపాప యనుచు
పంచప్రాణ సమానమ్ము పెంచినాము
అందమగు ఏరునకిచ్చి కల్యాణఫలము
లందు ఆశలు దీరె నేనేమిసేతు.

వ॥ దైవమహిమ ఏమోనని, బ్రాహ్మణోత్తముల బిలిపించి అభిషేకాలు మహాన్యాసపూర్వక నమకచమక మర్ధన, నవగ్రహజప పారాయణలు చేయించినా పద్మావతికి ఆరోగ్యము బాగుపడలేదు, దినదినమెక్కువగుచున్నది గాని ఏమియు మెరుగుగలేదు.

(శ్రీనివాసుడు ఎఱుకలసానిగా వచ్చుట సోదిచెప్పుట)

సీ॥ ఆపద్మస్థితిగని యాకాశరాజెంతో
రాత్రిబవలు విచారమందుచుండ
వకుళమాటలు వినక వప్పరేమొపెండ్లి
కనుచు యరుకలసాని వేషమేసి
కావిచీర రవిక కండ్లకాటుక పండ్లు
దాచన పుక్కిట తమ్మలమ్ము
ముంజేత ముఖానముంచె పచ్చలబొట్లు
తలను సోదిబుట్ట గుండ్లపూస.

గీ॥ సరులు మెడజుట్టి యరుకులసాని నంచు
దుగ్గునమలుచు నరచుచు దొడ్డతల్లి
బువ్వపెట్టమ్మ బిడ్డకోయవ్వ యరుక
మంచిసెడుగొను సెపుతునే పిచ్చితల్లో.

వ॥ వకుళాదేవిమాట వారు సమ్మతింతురో లేదో యని శ్రీనివాసుడొక యుక్తిబన్ని, ఎరుకలసాని వేషముధరించి కావివన్నె చీరగట్టి చేతులనిండా మొగాన ముచ్చటైన పచ్చబొట్లు పుక్కిటతమ్మ కండ్లకాటుక పండ్లదాచిన తలమీద సోదిగద్దెబుట్టతో వకుళాదేవికన్నా ముందు ఆకాశరాజు పట్నం ప్రవేశించుచుండ నారదముని.

మంజరి

చిత్రవిచిత్రపు వేషముగాంచియు శ్రీనివాసునకు మ్రొక్కెన్
శ్రీహరి నారద నీ రహస్యముజెప్ప కెవరికని బలుకన్

స్వామి నీమాయలీల పర్ణించి జెప్పచాలదొక నాల్కా-
సత్వరము నీకు పద్మావతికి కళ్యాణంబగునింకా.

వ॥ అంత నారదముని స్వామీ శ్రీపద్మావతి శ్రీనివాసుల కళ్యాణము జరుగును. ఇక లోకకళ్యాణమగునని శెలవుతీసుకొని సంతోషముగా నారదు డేగెను. అంత శ్రీనివాసుడు ఎరుకలసానిగా వెడలెను.

పాట

ఎరుక చెప్పుతానమ్మ సోది ఎరుగనీ కని వినని ఎన్నో రహస్యాలు ।ఎ।
జరిగినది జరిగేది జరగబొయ్యేది జరగనీ కార్యాలు జరుగచేసేది ।ఎ।
మరిమంచి జరుగునో మాకెడ్డజరుగునో
మంచిశెడ్డలు చేసి మరికలగ చెప్పుతాను ।ఎ। ।సో।

వ॥ రాజమందిరం వద్దజేరి వింతగా కేకవేశాడు. మహారాణియైన ధరణీ దేవి ఎరుకలసాన్ని పిలిపించి సోది చెప్పుమని కోరెను. మాయవేషములోనున్న యరుకత పద్మావతిని బుట్టముందు కూర్చుండబెట్టుకొని చేటలో మంచిముత్యాలు పోయించి గద్దెపలకకు పసుపుకుంకుమ పట్టించి ప్రాతకొత్త మూలదేవతలకు మ్రొక్కుకొంటూ సోది మొదలుపెట్టినది.

ద్విపద

సకునాలు సరిసూడు ఇగ్గినేశరుడ
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడ
గంగ పార్వతి మగడ కైలాసరేడ
గౌరిగద్దెక్కించు పార్వతి సుతుడ
శ్రీశైలమల్లన్న ఓదికంబరుడ
ఏడుకొండలవాడ వేంకటేశ్వరుడ
అలిమేలిమంగమ్మ ఆదిలచ్చిమగడ
కంచి మీనాక్షమ్మ కనకదురగమ్మ

కలకత్తా మహాకాళి కామాక్షి అంకమ్మ
తిరుపతి గంగమ్మ ఓ తిరుపతమ్మ
సినిజోతిలచ్చమ్మ జయమాలినమ్మ
భానుప్రియ స్మిల్కుస్మిత డిస్కోలియమ్మ
ముక్కోటి దేవతల ముందునే తలసి
నక్కన్ని పలుకులు పల్కించరమ్మ
దొడ్డదొర కూతరా దొంగసూపెందుకె
పుల్లపుచ్చుకోవే సల్లని సెమచూస్త
పోతంటె గడ్డమే బొట్టంటెపేంటి
గద్దెపట్టుకోవే గడుసరివే నీవు
అలనరో నీవొక్క తలపు చేసితివి
తెలిపెద నీకది రేటతెల్లముగ
కాయౌనా పండౌనా కచ్చితంబగను
వెయ్యేల నీకది వినిపింతు వినవె
వనములో వకమగవాని సూశావు
అతడు నీప్రేమకై ఆశించినాడె
కొంమ్మరో నీవంత కోపమువెందీ
గట్టిగా రాళ్ళతో కొట్టించినావు
మగరాజు సామాన్య మనుజుడు కాడే
ఆదిదేవుడు శ్రీనివాసుదేవాడు
మగువరో వానిపై మనసుంచినావు
అతడు నీలాగే ఆరాటపడెనె
నీరాకకోరి ధ్యానించుచున్నాడె
తప్పదు మీరింక దంపతులగుట
ఒప్పులకుప్పరో ఓపిక గనుము
తప్పదు నామాట తల్లొచ్చు రేపు
పెళ్ళికొప్పించునె కల్లదాదేమాట.

గీ॥ జ్వరముగాదిగి సంతాప భరముగాని
అలసటయుగాదు విరహ సంచలతగాని
మాంద్యమా కాదు వానిపై మరులుగాని
అలన నిద్రించునే ప్రియున్ దలచుగాని

వ॥ అని చెప్పి ఏట్నాలు పుచ్చుకొని ఎఱుకసాని పోయెను. అంత ధరణీదేవి ఆకాశరాజువద్దచేరి ఎఱుకత చెప్పిన విశేషాలు వినిపించిన మహారాజా లోచించి నారదమహారిషి తనతో భగవానుడే పద్మకు భర్తగునని చెప్పిపోయిన విషయం జ్ఞప్తికివచ్చి భార్యతో ఇలా అన్నాడు.

గీ॥ వనిత మనపూర్వకృత పుణ్యవశమునచేత
ధరణి శ్రీనివాసుడల్లుడై దనరెనేని
మనకు నెందైన కొరత సీమహిని గలదె
కన్యధన్యత నందెనో పలికిమిన్న.

వ॥ ఎరుకసాని చెప్పినట్లు ఆవేటగాడు నిజముగా దేవుడే అయి యుండ వచ్చును. మన పద్మకూడా దైవాంశచే దొరికినది. కనుక శేషాద్రిపైనున్న వానికే యిచ్చి పెండ్లి చేయుదమన. ఆమాటవిని ధరణీదేవి.

తోహర

మాతిముడిచి తన నోరుకొట్టుకొని నిదియేమన్యాయమ్మొ
అతి సుకుమారి నల్లారముద్దుగా ప్రీతిని బంగారమ్మొ
వంటి బిడ్డను కొండల కోనలనట్టి అడవి కోయనికిన్
పట్టినిచ్చి ముద్దు చిలుక పిల్లికి నోటికందించినట్టులికన్.

సీ॥ చిల్కపల్కుల కెంతో అలరుదురేకాని
గండుపిల్లికి నోటికిడుదురెట్లు
ముద్దుగా మరువంపు మొలకను బెంచియు
యద్దున గాహార మిత్తురెట్లు

సంపెంగ పూలవాసన చూతురేగాని
నిప్పునగా బడవేయ నోర్తురెట్లు
అమృతంబునందు హాలాహలంబునుబోసి
కన్నబిడ్డను జంపుకొన్నయట్లు.

గీ॥ క్రూరకంటక రాక్షస ఘోరవిపిన
దుర్గమారణ్య భీకర మృగన గాన
కొండగోయని కిడ మదిగోరునెట్లు
చెలగు సుగుణాలవాల మత్ప్రాణబాల.

వ॥ నాథా ఇదేమన్యాయము అల్లారు ముద్దుగా పెంచిన చక్కని బిడ్డను కొండల దిరుగు గోయ కసాయవాని కిచ్చినసెట్లు. సుకుమారి జీవితము నాశము చేయుటెట్లు చేజేతులారా మన పద్మను చెట్టుగుట్టల కర్పింతురా. వలదు మన్నించుడు యీ సంబంధము మాని తగిన రాజకుమారునకిచ్చి దాని కాపురము నిల్పుదని ఏడ్చెను. రాజు ప్రాణేశ్వరీ దిగులు పడకు నేను మాత్రము తొందర పడి అమ్మాయి బ్రతుకు పాడుచేతునా విధిని తప్పించలేము. ఆలోచింతము యూరడిల్లుమనిచెప్పి పద్మావతి మందిరానికి వెళ్ళిరి.

తోహరి

జ్వరతీవ్రంబున వరుకలువరించు పద్మావతినిన్‌జూచి
వడిజేర్చుకొనియు బుజ్జగించుచున్ నుడివె నిటు విచారించి.

గీ॥ దైవకృపతోడ మాకిలదక్కితంచు
ప్రాణసమ పెన్నిధిగి ఆశవెన్నోనీపై
పెట్టుకొని పెంచుకొన్నాము ప్రేమతోడ
మనసులోనున్న కోరికల్ మాకుదెల్పు.

వ॥ నీ విచారమును మాకు జెప్పుమన పద్మ కన్నీరుగార్చి.

పాట

తలిదండ్రులు నాక్షేమంబుగోరుదురు దాపరిక మేల దాచక జెప్పెద ।త।
చెలులతోడ ఉద్యానవనంబున జేరి వేటగాని వేష రూపమున ।త।
వచ్చి సుందరాకారమున నన్ను వరించి ప్రేమల వలపించినట్టి
సత్సరిత్రుడు దేవదేవుడాతని భర్తగా నిశ్చయించుకొంటినే ।త।

వ॥ వేటగాని రూపమున వనముచేరి అతడెన్నో మహాత్మ్యములు చూపి. నాకిలలో కోటి మన్మథరూపులు సాక్షాత్కారమిచ్చి అతని దర్శించి మైమరచి అతడే నాకు తగిన మగడని కోరుకొంటిని గాన మీరు సమ్మతించిన ఆమహాను భావునకే యిచ్చి పెండ్లి జేసి పుణ్యముగట్టుకొనుడనెను.

మంజరి

ఆమాటలు విని ధరణీదేవి రాజును ఆశ్చర్యమందెనూచీ
అమ్మ దిగులేల నీకోర్కె దీర్తునని పల్కె సంతసించీ.
శేషాద్రినుండి వకుళాదేవియు జేరె అంతఃపురము
రాజురాణి యోగినిపూజించి నీ రాకచే ధన్యుల మనియు.

గీ॥ అమ్మ యోగివి నీరాక కేమికార
ణంబొ దెల్పుము మీ నివాసంబు నెచట
నుండి వచ్చితి కార్యమేదండిదైన
కోరు దీర్చెద సాధ్యమౌ తీరుతోడ.

చ॥ అనివిని సంతసించి కడునాదర పూర్వక బుద్ధితోడ మీ
వినయ విధేయత్యాగగుణ విశ్వజన ప్రియపుణ్య దంపతుల్
మనసిజరూప సద్గుణ సుమాత్రుస్వరూపిత మీదు పుత్రికన్
వనమున గాంచి నాదు సుకుమారు వరించియు బనిచె నన్నిటున్

వ॥ మహారాజా మీదంపతులు చాలా ధన్యులు ఏలనన సాక్షాత్తు లక్ష్మీ స్వరూపము మీ బిడ్డగా దొరికినది. మీరు పూజ్యులు కాన నేవచ్చిన పని వినుడు

నా నివాసము శేషాచలము నాకొక కుమారుడున్నాడు. ఇరువదియైదు సంవత్సరములు యీడుగలవాడు చక్కనివాడు. కారణాంతరము వలన సిరిని పోగొట్టుకొని యిపుడు బీదవారమైనాము. నాకుమారుడు మీకుమార్తె పద్మావతిని ఉద్యానవనమున జూచి ప్రేమించి ఆమెను దప్ప ఇతరుల నేపెండ్లాడనని పట్టుబట్టినాడు. ప్రస్తుతం ధనం మాత్రం లేదుగాని మూడు లోకములేలగలిగిన లక్షణములు గలవాడు బుద్ధిమంతుడుగాన మీ బిడ్డను మా చిన్నవానికిచ్చి పెండ్లి చేయవలసినదని మిమ్ములను కోరుటకు వచ్చితి. మీరేమియు సందేహించ బనిలేదు. వాని పేరు శ్రీనివాసుడు దైవాంశసంభూతుడు మానవమాత్రుడుగాడు. నే సత్యము చెప్పుచున్నాను నామాట నమ్ముడన.

మంజరి

ఆమాటలువిని ఆకాశరాజు ఆశ్చర్యముతో యమ్మా
నీమాటలు అమృతమువలెనున్నవి ఈవిషయంబును నేను
పెద్దలతోయోచించి తప్పకన్ వర్తమానంబుజేతున్
సంతోషంబున శెలవుగొనినావె. శేషాద్రి శ్రీనివాసున్
జేరి సర్వంబు విన్పింప హరియు చెంగున గంతులు వేసెన్.

వ॥ శ్రీ ఆకాశరాజు వకుళాదేవి నంపించి శ్రీనివాసునకు పద్మావతినీయ నిశ్చయించుకొనేగాని అతని నిజస్థితి తెలియుటెట్లని యోచించి తన తమ్ముడైన తొండమానుని బిలచి తమ్ముడా పద్మావతికి వివాహముచేయవలెనని సంకల్పించితిని. శేషాద్రిపైనున్న శ్రీనివాసునకు యివ్వవలెనని తలంచితిని కాని వాని విషయము మనకెవ్వరికిన్ దెలియదుగాన మనకు ముఖ్యులైన మహానుభావుడు శ్రీ శుకుల వారిని శీఘ్రమె పిలుచుకొని రమ్ము వారు వచ్చిన మన సంశయములన్నియూ తీరిపోవునని బంప.

గీ॥ అన్నయానతి నాతొండమానురాజు
శీఘ్రమేజని శుకయోగి నాశ్రమంబు
జేరి సాష్టాంగమిడి మ్రొక్కి స్వామితోడ
వినయమొప్పగ తనయన్న వినతి దెల్పె.

పాట

అగ్రజుడాకాశరాజు యాజ్ఞజేసె మిమ్ము వేగ
దోడ్కొనిరమ్మనుచు నన్ను శుకయోగీశ్వరస్వామి ।అ।
సుతపద్మావతి వివాహ శుభఫలంబు యోచింపగ
ప్రార్థించెడు తొండమానుని మాటలు విని శ్రీశుకుడున్
వేగమె ఆకాశరాజు వేదికకున్ జేరినంత
అర్ఘ్యపాద్యముల చేతను గౌరవించి పూజించెరి. ॥అ

వ॥ శుకయోగి ఆకాశరాజు ఆస్థానముచేరినంతనే అర్ఘ్యపాద్యములతో పూజించి యోగక్షేమములు తెలిసికొని స్వామీ మీరు మహానుభావులు సర్వము తెలిసినవారు మీరు చెప్పునది మాకు వేదవాక్కు నా కుమార్తె పద్మావతి జనన వృత్తాంతము తమకు తెలిసినదే కదా. ఇప్పుడామె వివాహముచేయ నిశ్చయించితిని. వకనాడు మన పద్మావతి ఉద్యానవనములో వకవేటగాని చూచినదట. ఆదిమొదలు ఆమె వానిపై మోహము కల్గియున్నది. అతడు శేషాద్రిపర్వతముపై నివశించునట. వానిపేరు శ్రీనివాసుడట. మీరు త్రికాలవేదులు సర్వంతెలిసిన వారు వాని పుట్టుపూర్వోత్తరములు ఏమిటో దానక చెప్పుడన శుకుడానందించి.

ఉ॥ ఏమితపంబొనర్చి జనియించితిరో మరి ఎన్నిపుణ్యముల్
నీముముతోడ జేసితిరొ నీసతిపుణ్యమొ నీయదృష్టమో
కామితసిద్ధి దాయకుడు ఖండితదృష్ట నిశాటసర్వ
మర్చామర పూజితాంఘ్రుడు అనంతుడు అచ్యుతు డల్లుడయ్యె.

వ॥ అంత శుకునిహృదయమంతులేని ఆనందము పొంగి ఆహా భగవంతుని కళ్యాణము కనులారా చూచు భాగ్యం కలిగెనుగదాయని సంతసించి రాజా నీవెంతయో అదృష్టవంతుడవు పద్మావతి నెంతయో ధన్యురాలు శేషాద్రిపై నివసించె శ్రీనివాసుడు మానవుడుగాడు పదునాల్గులోకాలు పాలించు శ్రీమన్నారాయణమూర్తి నీ పూర్వజన్మ పుణ్యమువలన నీకల్లుడు కాబోవుచున్నాడు ఆ మహానుభావుని కాళ్ళుకడిగి కన్యాదానము చేసిన మీ వంశము తరించును.

ఉ॥ ఎన్నియొ మేలవత్సరము లెన్నివ్రతంబులొ నెన్నిదీక్షలన్
ఎన్నియుగంబులుండి మరి యెందరొ దేవమునీంద్ర బృందముల్
నెన్నొ మహాస పీఠలను నోర్చిన భక్తులకున్న దర్శనం
బెన్నగ నీకు సన్నిధిగ నీసుత భక్తిరగ లభ్యమయ్యెరో
యన్న భవత్కృపన్ గలిగె వెన్నుడు శ్రీహరి పెండ్లిసేయగన్.

వ॥ ఆభగవానుని దర్శనము కొరకు మావంటి రుషులు ఎన్నియో ఏండ్లనుండి తపస్సులు చేసినను మాకు దర్శనము లభించుట కష్టము. అట్టిపరమాత్మ నీకు అల్లుడైన నీజన్మ సఫలమగునని. శుకయోగి మాటలు విని ఆకాశరాజు పులకించి పొంగిపోయెను.

మంజరి

మ. స్వశీఘ్రంబని దేవగురు బృహస్పతిని బిల్పించే
శుభలగ్నము నిర్ణయించుమనగా శుకయోగిని గనినెంతా.

వ॥ అప్పుడు బృహస్పతిని రప్పించి వారిని పూజించి పద్మావతి శ్రీనివాసుల ముహూర్తనిర్ణయము చేయుమనె. బృహస్పతి పంచాగముచూచి అయ్యా కన్య నక్షత్రం (మృగశీర్షం) శ్రీనివాసుల జన్మనక్షత్రం శ్రవణం గాన ఉత్తరఫల్గుణి నక్షత్రము శుభముగాను వైశాఖమాసాన శుద్ధదశమి శుక్రవారము నాటిరాత్రి శుభముహూర్తము నిర్ణయించి శుభలేఖరిచ్చి బృహస్పతి సంతసించి శలవందెను.

వ॥ ఆకాశరాజు బృహస్పతిని రావించి, వినయముమంత మీరా ఓస్పదించి మహాత్మా మీకు అపార వలన శ్రీనివాసుని మహాత్మ్యము విన్నాను. నాకుమాత్రం పద్మావతిని ఇయ్యొ నిశ్చయించాను కనుక తాము దేవగురువులు మాకు పూజనీయులు కళ్యాణమునకు మంచి ముహూర్తము నిశ్చయించి తామే శుభలేఖ వ్రాయవలసినదిగా ప్రార్థింప బృహస్పతి సంతోషించి రాజా చాలా ధన్యుడవు భగవంతుడు నీకల్లుడు కాబోవుచున్నాడు. అని పంచాంగం తీసికొని పద్మావతి

జాతకమును శ్రీనివాసుని జాతకమును వారివారి నామ నక్షత్రములనుబట్టి గుణించి లగ్నశుద్ధిగావించి వైశాఖశుద్ధ దశమీ శుక్రవారమునాడు సుముహూర్తము నిర్ణయించెను.

శ్రీ శ్రీ శ్రీ శేషాచల నివాసియైన శ్రీనివాసమూర్తికి ఆకాశరాజు వ్రాయు శుభలేఖార్థములు.

ఆర్యా తమ మహిమావిశేషములు పెద్దలవలన విని ఆనందించాను. నా కుమార్తె చిరంజీవి సౌభాగ్యవతియైన పద్మావతిదేవిని తమకిచ్చి సాలంకృత కన్యాదానముచేయ నిశ్చయించుకున్నాను. అందుకు యీ వైశాఖశుద్ధ దశమి శుక్రవారము. ముహూర్తము పెద్దలు నిశ్చయించినారు కనుక తాము బంధుమిత్ర పరివారముతోవచ్చి నేనిచ్చు కాన్యాదానం స్వీకరించి నన్ను కృతార్థునిచేయ ప్రార్థన.

ఇట్లు
ఆకాశరాజు

ఈ విధముగా శుభలేఖ వ్రాయగా ఆకాశరాజు ఆశుభలేఖ శుకయోగికిచ్చి,

గీ॥ ప్రేమ అభివందములుగా నీమమొప్ప
శుభముహూర్తపు పత్రికన్ జూపి నిచ్చి,
వారియనుమతి పత్రమవ్వారి రాక
దెలిసికొనిరండు క్షేమ సుకాలవాల.

వ॥ స్వామీ తాము శేషాద్రికివెళ్ళి యీ శుభలేఖ శ్రీనివాసునకిచ్చి వారి నుండి ప్రత్యుత్తరము తేవలయునని వేడుకొనిన శుకుండు సంతోషించి సాహో రాజా నేనెంతో ధన్యుడ

గీ॥ ద్వాపరయుగంబున రాయభార ఫలము
దేవ రుక్మిణీవల నగ్నిద్యోతనుండు
పుణ్యఫల బ్రాహ్మణునికట్లు పుణ్యఫలము
అబ్బె నేటికి నాకునో అర్యవినుతా.

తోహరం

అని విన్నవించి పసిడి పళ్ళెమున గొనివచ్చి పసుపు కుంకుమ పూలు
ఫణిశయనునకున్ నంపె మదంబున పద్మచిత్తపవు లేఖల్.

వ॥ అంత శుకయోగీంద్రుడు శుభలేఖతీసికొని నారాయణపురము నుండి
శేషాద్రికి పయనమయ్యెను.

ఖండగతి

అల్లదిగొ శేషాద్రి అదేస్వామి పుష్కరిణి
కలియుగ వైకుంఠంబునదే శ్రీనివాసంబు ।అ।

ప॥ అదే సంకటములబాపు నదే వేంకటాచలము
అదిగొ మునిజనులు గోవిందయను ఘనరవము ।అ।

అ॥ప॥ బంగరు గోపురములు బంగరు శిఖరంబులు
బంగరు ద్వారంబులు బంగరు వాహనములు ।అ।

గీ॥ దేవగంధర్వ కిన్నెర దివ్యపురుష
లెందరో ఋషులు భక్తులెన్నెన్నొ ముదుపు
ముక్తికై కాన్కలున్ గొని భక్తితోడ
చీమ బారులగజేరె చిత్రమేమొ.

వ॥ శుకమునీంద్రుడు శేషాద్రిజేరి నెక్కుచుండ.

దరువు

చిత్ర విచిత్రములగు దృశ్యములు
పత్రపుష్పముల ఘనవృక్షంబులు
నేత్రపర్వత శిఖర మృగంబులు
తీర్థజలాకర ఖగవిహంగములు
శుక పిక శారిక కిలకిల రవములు
చక్కని ఫలముల మెక్కెడి కోతులు
నిక్కిదిలకించు జింకల గుంపులు

చిక్కని లతలు కొన్ని కుంజములను
మెక్కి పండిన ఫలంబు మేకములు
ఘీంకరించెడు ఘన మదగజములు
లెక్కలేని చిత్రంబులు చూచుచు
శుకయోగి శ్రీనివాసు దర్శించె.

వ॥ కన్నుల పండువుగా సప్తగిరులకైన చిత్రవిచిత్రములైన దృశ్యములను చూస్తూ ఆశ్చర్యమానసుండై తన శేషాద్రిజేరి శాంతినిలయముగా పుష్పలతాది శుకపికశారికా యుతమగు చక్కని చల్లని ఆశ్రమ పర్ణశాలఖాంచి అటకేగ శ్రీనివాసుడు ఒక పూలపాన్పుపై కూర్చొనియుండ వకుళాదేవి దైవధ్యాన పద్మాసన ధ్యాననిష్టా గరిష్ఠురాలై కూర్చొని

గీ॥ శేషగిరిపైన శతకోటి తేజమున
సుందరుని శ్రీనివాసు చెంతజేరి
మేను పులకింప స్తుతియించె జ్ఞానమౌను
మన్ననంబున పిలిచె నాపన్నదొంగ.

ఉ॥ అంబుజనేత్రు ధ్యానమున కంజలిమోడ్చి హసించి కనుల బా
ష్పంబులు రాల్చి చేరజని పాదములంటిన కౌగలించి న్యా
యంబుగ ఆర్ఘ్యపాద్యములిడి ఆదరబుద్ధి వచించె మీదు పా
దంబులు నంతరాత్మతో పదంబున వచ్చిన రీతి చెప్పుడీ.

వ॥ మహామునిని చూడగానే శ్రీనివాసుని సంతోషమునకు మితిలేదు. భక్తితో ముని పాదపూజలు జేసెను. అంత వకుళాదేవి సమస్త ఫలములతో అతిథి పూజసల్పి ఆరగింప జేసెను. శ్రీశుకుడు సంతోషించ శ్రీనివాసుడు స్వామీ మీరు వచ్చిన పని అడుగవచ్చునాయని. శుకయోగి ఆనందముతో శ్రీనివాసుని కళ్యాణమస్తు అని దీవించి తాదెచ్చిన శుభలేఖ చేతికిచ్చి శ్రీనివాసా ఈలేఖ చదువుకొనుము నీ కంతయు విశదమగునన.

గీ॥ చిత్తరువుజూచి చిరునవ్వు చిందులాడ
హ త్తుకొని లేఖ చదివియు ముద్దులూర
పొంగి కళ్యాణ విశేషము వకుళతోడ
నంతయును జెప్ప జనని యానందమందె.

తోహర

స్వాములు మీరు నా కళ్యాణమునకు కారణభూతులు నగుట
నేనెంతయొ మిము మెచ్చుకొంటి మీ మేలు మరువజాలనెట.

వ॥ అనగ శుకయోగి నవ్వుచూ (శ్రీ)నివాసా నీవు సకల లోకములకు ప్రభుడవు నీ సంకల్పమున కడ్డులేదు. ఇందునేజేసిన దేమియూలేదు. దయచేసి ఆకాశరాజుకు మీ అభిప్రాయముదెల్ప ప్రత్యుత్తరము వ్రాసియిండన ప్రత్యుత్తర మిట్లు వ్రాసెను.

శ్రీమన్మహారాజరాజ పరమేశ్వరుడైన ఆకాశరాజు సన్నిధికి శేషాచల నివాసుడైన శ్రీనివాసుడు నమస్కరించి వ్రాయు విజ్ఞాపనము.

మహాశయా మీరు బంపిన శుభలేఖ ప్రేమతో అందుకున్నాను. చదువుకొని గ్రహించుకొన్నాను. మీ కోరిక ప్రకారము నడచుకొనుటకు సంసిద్ధుడను ముహూర్తదినమునకు తప్పక వచ్చుచున్నాను.

ఇట్లు
శ్రీనివాసుడు

మంజరి

శుకయోగి శ్రీనివాసుండిచ్చిన శుభలేఖను గొనిపేగా
శలవందిజేర నాకాశరాజు చయ్యన రుషికెదురేగా
సంతోషంబుని సభవారెల్లరు సత్కరింప వేవేగా
శాంతచిత్తుడై విశదీకరించే భక్తవత్సలుడు జనగా.

గీ॥ కమల గర్భుని బొడ్డునగన్నవాని
మారజనకుని మాధవు మందహాసు
శేషగిరివాసు దర్శింప సంతసించి
ప్రేమతో నన్ను పూజించి ప్రీతితోడ.

మంజరి

శుభలేఖను గొని జదివి విన్పించె సంభ్రమమున తనతల్లీ
శుచిర్భూతయై ఫలములన్ బెట్టి సూనృత సద్గుణవల్లీ

వ॥ నాకు మధురఫలముల ఆతిధ్యమిచ్చి శుభలేఖ చదివి సంతసించి ప్రత్యుత్తరము వ్రాసియిచ్చెనన అది ఆకాశరాజు చూచి చదివి సంతోషంతో పెండ్లిప్రయత్నములు చేయింపబోయెను.

వ॥ అంత రాణివాసమున పద్మావతిని జూచి

గీ॥ చలులు పద్మావతీదేవి చెంతజేరి
కలలు ఫలియించె యింక నీవలపుమాను
కలువరించితి జ్వరములో వలపుగాడె
బాల నీ మగడాయె నీకేల జాగు.

పాట

కాళ్ళగజ్జెలే ఘల్లుఘల్లుమన గంతులు వేయుచు గజగమనలతో
నుల్లాసంబున చల్లగబాడుచు నెల్లచెలులతో నాటలాడుచున్
చిల్కపల్కులతొ చిందులు ద్రొక్కుచు వలపుతేనియలు నొలుకచిలుకతో.

వ॥ పద్మావతీదేవి తన పంచవన్నెల రామచిలుకను చూచి తన కళ్యాణము కలసివచ్చెనని ఉత్సాహసంభ్రములతో.

పాట

చిన్నారీ ఓ చిలుకా విన్నావా
ఇన్నాళ్ళకు నేకోరిన కృష్ణయ్య పతియయ్యెనె ।చి।
వెన్నుని వర్ణింప నాకు వేకనులు చాలవె
కిన్నెరగానముతో నిక వన్నెగాని పాడెదనె ।చి।
వన్నెకాడు వేటలాడవచ్చి నన్నువలచెనే
కన్నుగానక రాళ్ళతొ కరినరాల గొట్టించితి ।చి।
మన్నించిటు వలపుబెంచి మాధవుడే గెలిచాడే. ।చి।

గీ॥ శేషగిరివాసు శతకోటి తేజమదన
సుందరుని శ్రీనివాసుని చిత్రపటము
జూచివర్ణించె మేన్మరచి రాజపుత్రి
కనులలో గానుపించె నావెన్ను దచట

వ॥ పద్మావతి శ్రీనివాసుని చిత్రముచూస్తూ మైమరచిన ఆమె కనులకు పటములోనున్న శ్రీనివాసుడు కదలి పల్కరింప ఆమె ఆశ్చర్యమంది యిట్లు నుతించెను.

పాట

నీలమేఘపు చాయ నిరసించు నెమ్మేను
చిలిపి నవ్వులతోడ వలపించె చెలికాడె ।సీ।
వలరాజు మరపించు పట్టినామమువాడె
కలలన్ని పలియింప గానుపిలచినాడె ।సీ।
వజ్రకవచహస్త వజ్రకిరీటంబు
కరకంకణ తిరుమణిహార కనకచేలు
యురుకేలకేయూర కర్ణకుండలధారు
వరకౌస్తుభా తులసి యురమాల సుమధరుడె. ।సీ।

వ॥ అని శ్రీశుని దర్శించి స్మరించె, నంతలో చెలులుచేరి అమ్మగారు రమ్మన్నారని పిల్చుకబోయిరి.

గీ॥ ఇట్లు పద్మావతీ శ్రీశుకల్యాణవార్తి
అన్నిలోకములకు దెలిసి నంతలోన
నారదుడు శేషగిరిజేర గౌరవించి
తనదు కల్యాణలగ్నంబు విన్నవించె.

వ॥ నారదమునిని శ్రీనివాసుడు గౌరవించి తన కల్యాణవార్త విన్పించి నారదమునీంద్రా.

పాట

మౌనిచంద్ర కల్యాణమవ్వెనే గాని చేత నరకాసైనలేక ।మౌ।
మానహీనతన్ ధనలక్ష్మిలేక నగునెపెండ్లి నల్వుర నగుబాటగు ।మౌ।
గాన నేదైనకార్యసఫలమ్ము గలుగుమార్గమేదైన యోచించి
మనకీ ఘనత మంటగల్పకన్ మునినాథ చెప్పు పున్నెమగునీకు ।మౌ।

వ॥ వివాహ కర్చులకు నొక్కపైసాయైననూ లేక దరిద్రముచే బాధపడు చున్నాను. నా లక్ష్మి ఏనాడో నన్ను విడచిపోయెను. ప్రపంచమున పేదవాని జీవితమన్ని విధములా బాధయేగదా. నాకు ధనముదొరికి యీపెండ్లి జరుగు నుపాయము చెప్పుమన నారదుడు తాతా నీ మాటలు నాకు నవ్వు వచ్చుచున్నది. 'తాననుభవించినగాని దరిద్రము సంగతి తెలియదన్నట్లు ఇంతవరకూ నీవు లక్ష్మి దేవితో ఆనందముగానుండి ప్రపంచదరిద్రులంతా నిన్ను అనేక విధాలప్రార్థించి అన్నవస్త్రాలు లేక అల్లాడుతుంటే నీవేమైనా వారిమొర విని కన్నెత్తియైనా చూచితినా. ఇప్పటికైనా దరిద్రుల బాధ తెలిసివచ్చెనా యన నారదుని యెత్తి పొడుపు మాటలు విని నారాయణుడు.

గీ॥ పడగనెత్తిన పాము జంపంగవచ్చు
చచ్చేపోయిన దానినే జంపనేల
కక్షతో కార్యభంగము కలుగనీక
కార్యసాధకుడవు గమ్ము ధైర్యమిచ్చి.

ఉ॥ దీనతతోడ వేడుకొను దీనజప్రియు శ్రీనివాసుతోన్
మానసలక్ష్మి నిన్ విడచి మాధవ బాధల జెందుటేలయా
కోనలలోని లక్ష్మికడ కోవిదునంపి కుబేరుబిల్చి నీ
కేనగు ద్రవ్యమున్‌గొని యఖండ వివాహము జేసికొమ్మికన్,
వ॥ శ్రీనివాసుని మాటలు విని నారదముని యోచించి.

మంజరి

బ్రహ్మరుద్ర ఇంద్రగ్ని రవికుబేరష్టదిక్పాలకులను
నవగ్రహంబుల తక్షణమే శేషాదికి రావించె వారందరును

కలిసి సభతీరియుండ నారదుడు గాంచి కుబేరునితోడా
బల్కెనిటులెల్ల సభవారు వినగ భాగ్యవంత హేరేడా.

వ॥ కుబేరా సృష్టికంతకూ నీవు భాగ్యవంతుడవు నీవొకమంచి కార్యము నకు సహాయము చేయవలెను ఏమందువా. ఈవైశాఖ శుద్ధదశమీ శుక్రవారము నాడు శ్రీ శ్రీనివాసమూర్తికి ఆకాశరాజుపుత్రి పద్మావతికీ కళ్యాణము జరుగును. ఇది లోకమంతటికీ కళ్యాణమే గాన యిప్పుడు శ్రీనివాసుడు లక్ష్మితనవెంట లేని కారణమున బీదవాడవై యున్నాడు. పెండ్లి కర్చులకు ధనములేక దిగులు పడి నాడు. నీవీ సమయమున స్వామికి కొంత ధనము అప్పునిమ్ము ఆ ధనమును నీకు స్వామి వడ్డీతోసహా తీర్చును. ఈపని చేసిన నీకెంతో ఫలముగల్గునన కుబేరుడు సంతసించి.

గీ॥ యంత ధన్యుడనైతి నాకింతకన్న
పుణ్యఫల మెట్టులబ్బు నాపూజ్యులైన
పద్మ శ్రీ శ్రీనివాసుల పెండ్లికొరకు
కోరినంతటి ద్రవ్యంబు గొనుడునిత్తు.

వ॥ కుబేరుడట్లె కోరినంత ద్రవ్యమిచ్చెదనన శ్రీనివాసుడు కుబేరుని పేరుతో ఏకకోటి పదునాల్గులక్షల రామ నిష్కములు తీసుకొన్నట్లు పత్రము వ్రాసియిచ్చెను. దానిపై బ్రహ్మ ఈశ్వరుడు అశ్వర్థము సాక్షియుగా నుండి అనంతరం యెక్కడివారక్కడ వెళ్ళిరి.

మంజరి

నారద నీ యుపకారము మరువ నా కోర్కెదీర్చితివి బాగా
పర కలహ కారి బిరుదె నీవు యుపకారి నెవరు లేరనగా
చిరాన వీణను మీటుచు బాడుచు నారదుడాడచు నేగా
త్వరను విశ్వకర్మను బిలిపించియు గౌరవించి వేవేగా.

వ॥ శ్రీనివాసమూర్తి విశ్వకర్మను రావించి పెండ్లి విషయము చెప్ప విశ్వకర్మ అందమైన పందిరిములు కళ్యాణమండప వేదికలు విద్యుద్దీపగోళములు

జలయంత్రంబులు మొదలైనవి యన్నియును సృష్టించి రెండవ స్వర్గమువలె వేంకటాద్రిని శృంగారించెను. శ్రీనివాసుడానందించి వకుళాదేవితో అమ్మా నా వివాహమున కెవరెవరు బంధువుల నెవరి పిలువవలెనన వకుళ నవ్వి.

( పెండ్లి ప్రయత్నము )

మంజరి

పదునాల్గు లోకవాసులెల్ల నీ బంధువులు కానివారెవరు
బంధు సాధుజను లన్నిలోకముల వారి రప్పింపగోర
సంతస శుభలేఖల వ్రాసి గరుత్మంతుని బిలచిన రాగన్
త్వరవాయువేగ మన్నిలోకముల వారికి బంపె శుభలేఖల్.

గీ॥ సంతసిలి రివ్వునన్ గరుత్మంతు డెగసి
యల్లవారికి శుభలేఖలందజేయ
సకలలోక నివాసులు సంతసమున
పత్నులన్ గూడి పెండ్లికి పయనమైరి.

వ॥ శ్రీనివాసు డిచ్చిన శుభలేఖలు తీసికొని గరుత్మంతుం డెగసి రివ్వున ఆకాశమార్గముజేరి అన్ని లోకములకు వెళ్ళి అందరికీ శుభలేఖ లందించెను. ఆ శుభలేఖలు చూచి సమస్తలోకవాసులు పెండ్లిప్రయాణము చేసిరి.

సీ॥ శారద బ్రహ్మయు పార్వతీశ్వర శచీ
ఇంద్రతాయు బృహస్పతియు నగ్ని
వరుణయమ వాయు కుబేరు సూర్యచంద్ర
నవగ్రహసమూహము నవ్వారి సతుడు
నారదతుంబురుల్ అత్రివశిష్టభర
ద్వాజ గౌతమ జామదగ్ని భృగుడు
సూత శౌనక శుకుల్ మొదలౌ మహామునుల్
రుషిపత్నులు యనేక శిష్యులెల్ల

గీ॥ లక్షలాదిగ బ్రాహ్మణాద్యక్ష బృంద
మూర్వశీ రంభ మేనక తిలోత్తమాది
గరుడ గంధర్వ కిన్నెర కింపురుషులెల్ల
పదియునాలుగు లోకాల భక్తులెల్ల.

మంజరి

జేరిరి సమస్తలోకవాసులున్ శేషాద్రియె సముద్రముగా
విశ్వకర్మ నిర్మిత విడుదులలో విశ్వజన నుతుల్ జలగా,

వ॥ సమస్తలోకవాసులునూ శేషాద్రికి సముద్ర పరివేష్టితముగా వేంచేసి విశ్వకర్మ నిర్మించిన విడుదులలోజేరి వారివారికి తగినట్లుండిరి.

వ॥ పెండ్లికి వచ్చిన వారందరికీ అగ్నిదేవుడు దివ్యాన్నములు పెట్టెను. కుబేరుడు వస్త్రభూషణము లిచ్చెను. వాయుదేవుడు సుగంధద్రవ్య పుష్పవాసన లందించెను. ఇంద్రుడు పెండ్లిపెత్తనము చేయువాడయ్యెను. వశిష్ఠమహాముని పురోహిత్యము పూనెను. ఈ విధముగా పెండ్లిసన్నాహములు పూర్తిగావించిరి.

(శ్రీ శ్రీ పెండ్లికి తరలిపోవుట)

వకుళాదేవి శ్రీనివాసమూర్తికి మంగళస్నానము చేయించవలెనని జెప్ప నంత బ్రహ్మదేవుడాలోచించి.

గీ॥ బ్రహ్మదేవుడు శ్రీ శ్రీనివాసునితోడ
మంగళస్నానమును జేయ లక్ష్మిదేవి
వద్దలేదాయె శ్రీదేవి పెద్దభార్య
శుద్ధ జలస్నానమునుజేయ శుభముగాన
సత్వరమె లక్ష్మిదేవి బిల్పించ మనగ.

వ॥ పెద్దముత్తైదు లక్ష్మి నీ పెద్దభార్య మంగళస్నానములు చేయించుట శుభముగాన పిల్పింపుము శ్రీనివాసాయన. త్రుళ్ళిపడి అన్నా మరచినానే కమల గర్భు బొడ్డునగన్న వానినిచూచి ఇట్లనెను. పైకుంఠమున నాడు భృగుమహాఋషి

వచ్చి నావక్షమున తన్నినందుకు కోపించి కొల్లాపురములో తపము చేయు చున్నదే,

చ॥ అలుకవహించి లక్ష్మిజనె యాపనసీమ దపంబు సేయగన్
నిలుకడలేక పోయెకట సీతులు దెల్పిన రెక్కచేయకణ
పలుకులికేల సూర్యునటకంపియు నెట్టులొ బిల్వనంపుదుణ
కలవరబెట్టి శీఘ్రముగ కాంతను బిల్చుకరమ్ము దినకరా.

వ॥ అంత శ్రీహరి సూర్యభగవానుణ బిలచి నీవు దక్క యీ కార్య మెవ్వరు నెరవేర్చజాలరని ఇట్లుజెప్పె.

గీ॥ అమ్మ నీపతి జ్వరతీవ్ర మధికబాధ
తాళజాలక నిన్నిపుడె తక్షణంబు
రమ్మనుచు బంపె నీవిపుడు రాకయున్న
ప్రాణములెసున్న సతిలేని బ్రతుకుకన్నా.

వ॥ కన్నీరు విడచి నను బంపెంచినాడని తక్షణమే దోడ్కొనిరమ్మన సూర్యభవానుడుబోయి లక్ష్మిదేవి కీవార్త జెప్ప.

మంజరి

ఆమాటలు వినినంతనె భీతిలి హాయని భువిమూర్ఛిల్లా
రమ్ము నావెంట శేషగిరిజేర్తు సమ్ముదమున జాగేలా.

చ॥ అన విని వేగ శేషగిరి నెంతయు సుందర నెండ్లి పేటకల్
మునిజన దేవసందడిని మోదముతో బరికించి నద్దిశెల్
గనిసన శ్రీనివాసుసతి గాంచియు నాటకమాడ లక్ష్మిబల్
వనటనుబూచి నిట్లనియె పెన్నుని మోసమెరింగి దద్రిలణ

వ॥ అంత లక్ష్మిదేవి సూర్యదేవుని మాటనమ్మి శేషాద్రిచేరిచూడ సర్వాలంకార శోభాయమాన పచ్చతోరణ ముత్యాల ముగ్గు లతిమనోహరంబులగు కళ్యాణమంటప వేడుకా జన ముని దేవ సమూహములతో నిండి కలకల్లాడుచున్న

వింత పెండ్లికుమారు చెంతచేరి కోప తాప మానసయై నిలువ చెంతజేరవచ్చు శ్రీహరి౯ విదలించి యిట్లనె.

త్రిశ్రగతి

పాట

ఇంతమోసగాడవంచు నెరుగనైతి గారడీడ
పంతముతో కనులుగప్పి కాంతనొకతె పెండ్లాడెదే ॥ఇం॥
అంతర్యము దెలియకనిటు పతిదేవునిగా నమ్మితి
కంతు జనక సీనటనా కల్లకపట మెరుగకనే
చెంతజేర వచ్చితి నిటు ఛీ ఛీ సిగ్గైనలేక ॥ఇం॥
మంతన లేటికి పోపొమ్మింతటితో దీరెరుణం. ॥ఇం॥

మంజరి

జలజల పూవులురాల అదింయలు ఘల్లుఘల్లుమని మ్రోగ
వెలవెల కన్నులవెంట కన్నీరు బలబలమని వ్రాలంగ
నుస్సురని నేడ్చునొయ్యారిజేర గస్సుమనిలేచు సతినీ
నిశ్చయంబు నెరుగింతు పూర్వకథనిజము వినుమికను దెలుసుకొనీ

సీ॥ త్రేతాయుగాన సీతారామయవతార
ముస రావణుడు నిన్నుగొని చనంగ
వీతిహోత్రులోని వేదవతిని నిచ్చి
తనలోన నిను జేర్చి దనుజబంపె
రావణకుంభకర్ణ సురులన్ వధియించి
చర విడిపించిన సమయమందు
అనలుండు నినుదెచ్చి అర్పించి చెరలోన
వేదవతి సీతగా బాధలందె.

గీ॥ యనగ దానిని పత్నిగా గొనుమటన్న
నొక్కబాణము నొకమాట నేకపత్ని

ద్వాపరంబున నీకోర్కె దీర్తునంటి
వేదవతి పద్మయైబుట్టె వాదమేలా.

మంజరి

అని జ్ఞప్తిచేయ విని లక్ష్మీదేవి శ్రీనివాసుని క్షమింపుమని
వినుతించి విష్ణుదేవు యాజ్ఞచేజనె మంగళస్నానంబుకని
పార్వతి భారతి లక్ష్మి యరుంధతి వకుళ ముత్తైదులొచ్చి
జల్వ పన్నీట స్నానమాడించి కళ్యాణ బొట్లుదీర్చి

వ॥ అంత బ్రహ్మ శ్రీనివాసునాజ్ఞచే వకుళాదేవి పార్వతి లక్ష్మి అరుంధతి సరస్వతులాది మొదలైన పుణ్యస్త్రీలు స్వామికి మంగళాస్నానపు ఏర్పాటు చేసిరి. ఘుమఘుమలాడు పన్నీటి జలకలశములతో రత్నపీఠమున కూర్చుండబెట్టి మంగళ వాద్యములు మ్రోగుచుండ ముత్తైదులు మంగళారతులు బాడుచుండ శ్రీనివాసునకు సుగంధ తైలములు తలయంటి పన్నీట జలకమాడించి నొసట తిలకము బుగ్గను కాటుకచుక్కపెట్టి పట్టుపీతాంబరములు గట్టించిరి. నందరూ పంచభక్ష్య పరమాన్నంబుల భుజించి కర్పూర తాంబూలములు వేసికొని ప్రయాణ సన్నాహాలలో నుండిరి.

బేహగ్—త్రిశగతి

పయనమాయె పెండ్లికి శ్రీహరియు దేవగణముతోడ
జయజయ ధ్వానముల దిశల చలగియు మారోగ్మోగుచుండ
సురపతి తారాపతి హరినైరావణమున నిల్పియు
చెలియలు నిరుదెసల పట్టు ఛత్రంబులగొని నిలువగ
ధాత భర్గ సప్తరుషులు స్వస్తివాచకములు పలుక
ప్రీతి వాణిగిరిజారుంధతి మంగళములు బాడుగ ।ప।

వ॥ నంత వివాహ సమయమున లక్ష్మీదేవి సఖులతో నలంకరించి సువర్ణ ఘటములతో దిగ్గజంబుల మీద తేబడిన వియద్గంగా తీర్థములతో లక్ష్మి యతని కిష్టంగ స్నానమాచరింపజేసి కేశములు సుగంధధూపములతో నార్చబెట్టి శరీరము

సుగంధముతో లేపనముజేసి పీతాంబరము గట్టించి మకుటాది సకలాభరణములతో నలంకరించి ఇంద్రాణి ఛత్రము ధరింప సరస్వతి గౌరి చామరములువీవ జయ విజయులు వ్యజనములు ధరింప లక్ష్మీసమేతుడై గరుడునధిష్ఠింప బ్రహ్మ మహేశ్వర వజ్రి వరుణయమ యక్షేశులచే సేవింప సనకాది వసిష్ఠాది మునులు సంస్మరింపబడ గంధర్వులుబాడ అప్సరసలాడ దేవ దుంధుభులు మ్రోయ దేవగణాది విష్వక్సేనాది ప్రార్థతులతో శేషాచలమునుండి క్రిందికిదిగి నారాయణ పురమునకు ప్రయాణము చేయుచుండ.

గీ॥ దారిలో పద్మతీర్థ మందాశ్రమాన
శుకమునీశ్వరు డదిగని శ్రీనివాసు
స్వామి కల్యాణమూర్తి దర్శనముతోడ
దన్యుడైతి ఋణంబె నాతిధ్యమిత్తు.

వ॥ శుకమునీశ్వరుడు శ్రీనివాసు దరిజేరి కల్యాణమూర్తి నిన్నుజూచి ధన్యుడనైతిని. నీవు నాపర్ణశాలనుండి నేనిచ్చు పండు తీసుకొని పొందవలె శ్రీనివాసుండు స్వామి మీరు నాకు మిక్కిలి పూజ్యులు. మీ మాటలు కాదనజాలను కాని మేమిందరముండ మీ రతిథ్యమెట్లు సమకూర్చగలరు యని పలికెను నవ్వి.

గీ॥ స్వామి మీదయలేకున్న సాగదెద్ది
స్వల్పకార్యములకు నీవు తెలియనట్లు
చిత్రనాటకమాడెద వంతెగాని
నీదు లీలలు తెలియునా నీలదేహ.

వ॥ నీ యనుగ్రహమున్న యెంత పని.

మంజరి

పదునాల్గులోకములు నీ కడుపున బ్రహ్మసృష్టి జీవులను
నీదుపోషణము నీవు తృప్తిబడ నంత తృప్తిబడుననెమా
శుకునికోరికన్ పర్ణశాలలో శుక కందమూల ఫలముల్
శ్రీహరిభుజింప దేవరుషిజనుల్ ఆతిథ్యమీయలేదనగ మునుల్

వ॥ దేవ మును కాతిథ్యమీలే దనుకొనుచుండ శ్రీనివాసుడది గ్రహించి పర్ణశాల బయటకొచ్చి ప్రేవుగాన అత్రేపుతో అందరూ తిన్నట్లే తృప్తిపడిరి.

సీ॥ ఆకాశరాజు పురమతి వైభవంబుగా
శృంగారముగను భూస్వర్గమనగ
బంగారు జండాలు పచ్చనితోరణాల్
పగడపు స్తంభాల పందిళ్లను
చల్వచప్పరములు జవ్వాజి యల్కులు
ముత్యాల ముగ్గులు చిత్రమైన
కల్యాణమంటప కనకరత్నాంచిత
పీఠముల్ వసిడి సింహాసనములు.

గీ॥ సకల బంధువులు మిత్రులు సంతసింప
అంతఃపురమందు పద్మను నాదరమున
స్త్రీలు జేయించె మంగళ స్నానములను
పట్టు పీతాంబరము లేడువార నగలు

వ॥ ఆకాశరాజు రాజధానియైన నారాయణ పురమంతయూ శృంగారం చేశారు. చల్వపందిళ్లువేసి పచ్చని తోరణములు కట్టించి పన్నీరు కలియంపిజల్లి ముత్యాల ముగ్గులు పెట్టించిరి. అంత పద్మావతీదేవికి అంతఃపుర స్త్రీలు మంగళ స్నానములుచేయించి బంగారు చెలగుల పట్టుపీతాంబరము కట్టించి ఏడువారముల నగలు దరింపజేసి శ్రీ మహాలక్ష్మివలె శృంగారించిరి. నంత శ్రీనివాసమూర్తి వస్తున్నారన్న వార్త విని, ఆకాశరాజు వద్మావతీదేవిని పట్టపు ఏనుగుపై కూర్చుండజేసి మంగళవాద్యములతో శ్రీనివాసుని కెదురుగా బయలుదేరిరి.

ఆది

పాట

ఎదురేగుదెంచి ఎంతయో నుతించి
సదయాత్మ మాజన్మంబు నేడుతరియించెనంచు

చ॥ ముదముతోడ నేన్గు పైన బంగరు
వింతమైన అంబారి నిర్మించి
సుందరుండు శ్రీనివాసమూర్తికి
సంతసమున పూలహారమేసిరి

గీ॥ కులము పావనమయ్యె నాకోరతదీరె
భవము ధన్యతనంద సంపదలు చెలగె
సర్వజనులకు సంతోష సమయమబ్బె
తొల్లి జేసిన సుకృతంబు ఉల్లసిల్లె

వ॥ ఆకాశరాజు శ్రీనివాసునిగాంచి స్తోత్రించి అనేక విధముల గౌరవించి మాతైపద్మావతీదేవిని అతనికి పునర్దర్శనం చేయించి పద్మావతీ శ్రీనివాసు సమస్త మేళతాళములతో పట్టణములో ప్రవేసింపజేసి వీధులందు ఉత్సవము చెను. ఆ ఉత్సవ సమయమున నగరములోని పుణ్యస్త్రీలు పద్మావతి సులకు హారతులుపట్టి లాజలు పుష్పములు అక్షతలు వారిపైజల్లి దీవించిరి. మాగధులు కైవారములు చేయుచుండ నృత్యగాన వాద్యములు మ్రోయు జయ జయ శబ్దములు మునులు పల్కుచుండ పట్టణమంతయూ వధూవరుల గించి అనంతరము శ్రీనివాసునొక దివ్యమందిరములో ప్రవేశపెట్టిరి. వారందరికి తగిన విడుదు లేర్పరచి ఆరాత్రి ఆకాశరాజనేక పాకశాస్త్ర లచేత మంచి మంచి పదార్థము లనేకరకములుగా వంటలు చేయించి వారికిందు భోజనములు పెట్టించెను.

॥ హోళిగళప్పడాలు పులిహోరలు షక్కెరలడ్లు చూదుపేడాలు
జిలేబిగారెలు వడల్ శిగడల్ వడియాలు పెద్దపేళీలను
బూరేలా వడలు నిద్దపుమీగడ వెన్నజున్ను పూరీలు
అనేక భక్ష్యములు తృప్తిగసాపడి ప్రేవుమంచనెన్

వ॥ ఆరాత్రి ఆకాశరాజు వశిష్టాది పురోహితుల కళ్యాణమునకు కావలసిన సంబారములన్నియు అడిగి తెలుసుకొని వారుచెప్పిన వస్తువులన్నీ సిద్ధము

చేయించెను. ధరణీదేవి చెలికత్తెల పిలిచి చీరెలు రవికలు పూజాద్రవ్యములు పండ్లు పసుపు కుంకుమలు నగలు మొదలైన ద్రవ్యములు కల్యాణమునకు సిద్ధము చేసెను.

పాట

ఆదితాళం కళ్యాణి

పద్మావతి శ్రీనివాసమూర్తుల ప్రీతిదెల్ప తరమా సుంతైన
భూతలమున నిటువంటి సొగసైన పుణ్యదంపతులు చెలువమున్ బొగడ
పద్మకనులలో శ్రీనివాసుండు తమ కనులలోన పద్మావతియున్
హృదయకమలముల ఉ.యుల రూపము
లందచందములు డెందముల కదరె (ప)

చ॥ ఎప్పుడు తెల్లవారునిక నెప్పుడు శ్రీహరి మోముజూతు నిం
కెప్పుడు పెండ్లిలగ్నమున నెప్పుడు నాసతి కంఠమందు నే
నెప్పుడు పుస్తెగట్టుదును నెప్పుడు నాసతి సుందరాంగితో
నెప్పుడు పల్కరించి మదనక్రియ క్రీడలదేలువారనో.

తోహర

అని యిటు నిద్దుర బట్టక ప్రేమల నదుముకొనుచు కడుప్రీతిన్
మనముల విరహము మరిమరి పొంగగ మదనతాపములతోడన్.

వ॥ ఇలా వకరినొకరు దల్చుకొనుచుండ.

సీ॥ తప్పు బయలుపడ్డ చొప్పున వాడిన
తెరవున చంద్రుడు తెల్లబోయె
సిరితొలంగిన వారి పరివారమట్టుల
సన్నగా చుక్కలు సమసిపోయె
కొత్తగా గపగూడుకొన్న దంపతులకు
గుండెలు ఝల్లన కోడికూసె
మేతకుబోయి తలక్రిందగు పక్షులు
దారి తప్పక తమ తావుజేరె.

గీ॥ కలువలను వాడి తమ్మిపువ్వులను విచె
పన్నులే నెల్లరకు వీచె పైరగాలి
తెల్ల మొనరించి తూర్పు ఖల్లున తెల్లవారె
పెండ్లివారు పురోహితులెల్ల లేచె.

వ॥ నంత ముహూర్తము సమీపంప ఆకాశరాజు సమస్త బంధువులతో మంగళవాద్యములతో శ్రీనివాసుని విడిది గృహమునకు బోయిరి. వశిష్ఠముని ఆజ్ఞ మేరకు ఆకాశరాజు ధరణీదేవి దంపతులు శ్రీనివాసునకు ఒంపిన తాంబూల వస్త్రభూషణాలిచ్చి పుష్పములచే పూజించిరి, శ్రీనివాసుని పట్టపు ఏనుగుపై కూర్చుండజేసి బ్రహ్మాది దేవతలు మునులు పుణ్యాంగనలు సమస్తవాద్యములతో విడిది గృహమునుండి రాజద్వారము చెంతకు దీసుకొనివచ్చిరి. ద్వారముకడ పుణ్యస్త్రీలు నీరాజనములిచ్చిరి. విమ్మట కనుల పండువుగా కళకళలాడు కల్యాణ మంటపమునకు శ్రీనివాసుని గొనిపోయి బంగారు పీటపై కూర్చుండబెట్టి వశిష్ఠ మహాముని చెప్పగా పవిత్రమగు స్వామిపుష్కరణీ తీర్థము. ధరణీదేవి బంగారు కలశముతో పోయుచుండ ఆకాశరాజు శ్రీనివాసుని పాదములు కడిగి తన శిరమున భార్యశిరమున జల్లుకొన వశిష్ఠ బృహస్పతియు కల్యాణమంత్రములు ప్రారంభించిరి. ఆకాశరాజు పద్మావతీదేవి చెయ్యిబట్టుకొని ధరణీదేవి బంగరు పాత్రతో జలముపోయుచుండ శ్రీనివాసుని చేతులో ధారవోసెను. వశిష్ఠుడు వధూవరులకు కంకణములుగట్టి సుముహూర్త గడియకు వశిష్ఠాదులు మంత్రములు చెప్పుచుండ మంగళ వాద్యములు మ్రోగుచుండ ముత్తైదువు మంగళములు పాడుచుండ శ్రీనివాసమూర్తి పద్మావతిదేవి మెడలో మాంగల్యము కట్టెను. దేవతలు పుష్పవర్షములు కురిపించిరి. మహామునులు ఆశీర్వదించిరి. అనంతరం మంచి ముత్యములు కళ్యాణదంపతులిద్దరు తలంబ్రాలు పోసికొనిరి, పెండ్లి వేడుకగా జరిగెను.

ఆది

పాట

బాల సూర్యకాంతిని వెల్గొందెడు
మాంగల్యము శ్రీనివాసమూర్తియు

బాల పద్మావతి గళంబునను
చాలసంతోషమున గట్టెనపుడు ।బా।

చ॥ మంచి ముత్యములు తలంబ్రాలుగా
రాసిపోసికొనిరి శిరముపై కసి
ముసిముసి నగవుల బిసరుహాననలును
మురిసి దంపతులనెల్ల రుహసింప ।బా।

ప॥ తలంబ్రాలుపోసి పద్మావతి శ్రీహరి
కళ్యాణ దంపతుల శిరములపై ।త।
తళుక్కు బంగారు పళ్లెరములతో
నొలుకు ముత్యాలు దోసిటను గొనియు ।త।

వ॥ ఇట్లు పెండ్లి వేడుకలు వైభవంబున జరిగెను.

సీ॥ ఆకాశరాజు తమ కల్లుడౌ శ్రీహరికి
కళ్యాణమందున కట్నములుగ
నూరు బారువుల బంగారు కిరీటమ్ము
ఒకకోటి బంగారు నిష్కములును
ఘనమణులు చెక్కిన కంఠహారంబులు
మాణిక్యపత కర్ణకుండలములు
సింహతలాట కింకిణ రవ్వలుంగరాల్
బంగరు మొలత్రాడు వజ్రకవచ
కనకపాత్ర రత్నకంబళంబులు వెయ్యి
ఏన్గులు పదివేల నశ్వములును

గీ॥ పద్మకున్ చీనిచీనాంబ్ర మణిమయాది
స్వర్ణభూషలు గ్రామముల్ శతములైన
దాసదాసీజనానేక రత్నాది అరణ
మిచ్చెసుత కల్లునకును నాశీర్వదించి.

మంజరి

ఘల్లుఘల్లుమను గజ్జెలందియలు కాళ్ళకడియముల్ పెట్టాగొలసు౻
వుల్లిపూచుట్లు వంకియుంగరము బంగరు నకిషీ పాదుకల౻
కరకంకణములు రవ్వగాజులున్ వజ్రపుటుంగరవడ్డాణంబుల౻
చవులకమ్మలున్ ముత్తెపు జుమికీల్ చెంపసరాలును సూర్యకిరిముల్
పాపిడిబిళ్ళయు వాల్జడ కుచ్చులు ముక్కుబేసర ముక్కెరబులాకు
సూర్యచంద్ర మణితారహారములు వజ్రనవరత్న ఖచిత నెక్లెసుల
మొదలుగా నెన్నో అరణ కట్నముల్ల కూతునల్లునకు మోదమున నొసగె.

వ॥ వారికిచ్చిన కట్నాలేగాక నూరు గ్రామములిచ్చి గౌరవించెను. వివాహమునకు వచ్చిన శ్రీనివాసునివైపు వారికినీ తన వైపువారికినీ సమస్త బంధుమిత్ర పరివారముల కందరికీ తగు మర్యాదలుజేసి బ్రాహ్మణులకు భూరి సంభావనలిచ్చి మృష్టాన్నములు పెట్టించి అనేక దానాదికము లిప్పించి ఈ విధముగా అయిదురోజుల పెండ్లి మహావైభవంబుగా జరిపించెను.

(శ్రీనివాసునకు పద్మావతి నప్పగించుట)

వ॥ నంత ఆకాశరాజు ధరణీదేవియు పాలధారలతో పద్మావతీదేవిని శ్రీనివాసు చేతులో నొప్పగించిరి ఆకాశరాజు చేతులబట్టుకొని స్వామీ శ్రీనివాసా నీవు సాక్షాత్తు భగవానుడని తెలుసుకొన్నాను. నీపాదము కడిగి బిడ్డనిచ్చుటవలన మావంశము తరించినది. పూర్వజన్మమున నెంతో పుణ్యములు చేయుటవలన భగవంతుడైన నీవల్లుడైనావు నీవు ధర్మదేవతవు నీకు తెలియని ధర్మములులేవు. అయిననూ తండ్రిని గాన నా మనవి వినుము.

రూపక తాళం

అప్పగించినాము మాకొక్కబిడ్డను ।అ।
అప్పా ఇచ్చాకములకొప్పా వాడినమాట
దప్పాడు సుగుణాల కుప్పను ।అ।
జెప్పెద పొరపాటుండిన చెప్పుము

నవరించుకొనుము చెప్పినమాట
గ్రహించుము మెప్పులకుప్పను నీకిడి
తప్పా నీయదే భారము ॥అ॥

గీ॥ వేళకన్నము లేకున్న నిల్వలేదు
నిదుర వేళకులేకున్న నీరసించు
ఎండనెరుగని సుకుమారి కొండనెక్కి
గట్టిగా పల్కరింప మాటాడలేదు.

వ॥ మా పద్మావతి ఏమియూతెలియని బాల ఆమెనేల నేల్కొంవోదు పూర్వము నీసంగతి తెలియక నిన్ను రాళ్ళతో కొట్టించెనన్న సంగతి మనసులో నుంచుకొనక క్షమించి పాలించుము అని చెప్పి.

గీ॥ కట్నకానుక లర్పించి కన్నకూతు
కౌగిలినిజేర్చి తలదువ్వి కంటినీరు
రాల్చి వడిజేర్చి ముద్దిడి జాలితోడ
వెక్కివెక్కేడ్చి నీతులజెప్పె వేదవతికి

ఆది

పాట

ఏరీతి నినుబాసి నుందుమే మెటులను ప్రాణములను ధరియింతుము ॥ఏ॥
నిరతము శశికాంత సౌధములపై జరియించి టూగుటుయ్యాలలూగి
చ॥ యిరుకేల దాసదాసీ జనులతో పూలసజ్జలన్ హంసతూలికా
తల్పంబుల శయనించి జరించెడు
చాల సుకుమారి వా కానలలో బాలనేరీతి నుందువక్కటా, ॥ఏ॥

గీ॥ పతియె గురు తల్లితండ్రి అత్తమామ
లాదరంబున సేవించి అతివలందు
కీర్తిచంద్రికలన్‌గొని కీరవాణి
షడ్గుణంబుల నీతిని వెల్గుమమ్మా.

గీ॥ ఇరుగుపొరుగిండ్ల కొంటిగా తిరుగరాదు
సౌధముల్నగలు దాసీలు పట్టుపుట్ట
మేది గతిలేదటంచని నేడ్వకెపుడు
తృప్తి సంసారమున్ దిద్ది కీర్తిగలుగు.

వ॥ అమ్మా నీ వనుకొన్న విజ్ఞానురాలవు నా చెప్పుమాటలు సావధానముగా వినుముతల్లీ, సాక్షాత్భగవానున కిల్లాలవై నందున చాలా అదృష్టవంతురాలవు స్త్రీకి భర్తయే భగవంతుడు. ఎల్లప్పుడు భర్తపాదసేవ మరువక నీ పతిమాట కెన్నడు ఎదురాడక పెద్దలసేవ చేయుము. ఆశ్రయించినవారికి ఆదరముతో పోషింపుము. పుట్టినింటికి అత్తవారింటికి పేరుప్రతిష్టలు నిల్పుము అనసూయాది మహాతల్లుల చరిత్రలు జ్ఞప్తికుంచుకొని ప్రవర్తింపుము మమ్ము మరువకుము అని అన్నియో నీతి వాక్యములచెప్పి బోధించెను.

మంజరి

అని ప్రియమారగ నీతులఁజెప్ప విని జాలి శ్రీనివాసుండు
అగ్ని సముఖమున బాసజేసినటు నేలుకొందు మీ సుతనెపుడు.

గీ॥ భీతిజెందకు మీపుత్రి ప్రీతితోడ
ప్రాణసమముగ నేజూచుకొనెదనయ్య
శాంతక్షమమాదిగుణముతో సత్యముగను
వనెద కనురెప్పపాటును కన్యనెపుడు

వ॥ అన విని నాయన శ్రీనివాసా.

ఉ॥ ఆడదు పెంకిమాటలను అయ్యమదీయ కుమారి నిక్కమే
జాడకుబోదు అన్యులను జన్మలుగామదినెంచి స్త్రీలతో
నాడగబోదెగ్గులను నారయ సత్యమే పల్కునెప్పుడుఁ
కీడొనరించినఁ మది నొగిఁ దయనేలుము బుద్ధిశాలివై.

వ॥ అని వేడుకొని పద్మావతిని అత్తవారింటికి ప్రయాణముచేయించి సారెలు చీరెలు నగలతో పద్మాదేవి నప్పగించె. శ్రీనివాసుడు అత్తమామల సెలవంది. శ్రీ పద్మావతితో గరుడవాహనమెక్కెను మిగిలిన పెండ్లివారు తమ తమ వాహనములతో ప్రయాణముసాగించుచుండ.

నంత శ్రీనివాసుండు మామగారిని బిలిచి.

గీ॥ పరమభక్తిని ప్రేమతో పద్మనేత్రి
కన్యదాతగ నిచ్చి నాకాళ్ళు కడిగి
పైభవంబగు కళ్యాణమేడుకగను
పుత్రినిచ్చితి నీమేలు మరువలేను
కోరుమేదేని వరమును దీర్తుమామ,

వ॥ నాతని భక్తికిమెచ్చి మామా నీవునాకొనర్చిన మేలు ఎన్నటికీ మరుప రానిది. నీకేమి వరము కావలెనో కోరుకొనుము ఇచ్చెదనన ఆకాశరాజు చేతులు జోడించి వినయముతో.

మంజరి

స్వామి నీకరుణ సర్వభోగ రాజ్యమును సకలమునేగలదు
దేవ వరముగోరు మిత్తునంటివి నీవే నాకు సర్వంబూ

గీ॥ స్వామి నీదయలేకున్న సాగునేది
చిత్రనాటకమాడెద వంతెగాని
నీదు లీలలు తెలియునా నీలదేహ
సర్వకాలము నీనామ స్మరణమెపుడు
మరుపకుండగ వరమిమ్ము మదన జనకా.

వ॥ అని ప్రార్థింప శ్రీనివాసుడు సంతసించి నీకుపరమాత్ముని సాయుజ్య మును ప్రసాదించితినన, ఆకాశరాజానందమందెను.

మంజరి

గరుడవాహనమునెక్కి పద్మతో నరుగు స్వామివేగమునన్
మార్గమధ్యమున అగస్త్యునాశ్రమము జేరనగస్త్యులు భక్తిన్

వ॥ అగస్త్యమహాముని శ్రీనివాసుని భక్తితో పూజించి. వారి నాహ్వానింప శ్రీనివాసమూర్తి తనవెంట వచ్చిన బ్రహ్మాదిదేవతలతో నిట్లనెను. అయ్యలారా మీకొక విశేషము జెప్పెద. వివాహమైన నూతన దంపతులు ఆరునెలల వరకూ పర్వతమెక్కకూడదు అని ధర్మమున్నది. గాన నేను ఆరుమాసములు యీ అగస్త్యముని ఆశ్రమమందేయుండి పిదప శేషాచలము జేరెదను అని వారందరికీ తగు మర్యాదలుచేయ బ్రహ్మ మొదలైనవారు శెలవుతీసికొని తమతమ నివాసములకు పోయిరి. శ్రీనివాసమూర్తి పద్మావతీదేవితో సుఖముగా ఆశ్రమమున నుండెను.

ఇట్లుండగా.

మంజరి

నారాయణపురమందు నారాజు నిరతము హరిని స్మరించి
నిరాహారుడై భక్తి భావమున అపుర అగస్మాత్తుగనూ
మరణావస్తను ప్రమాదస్థితితో మంచమున బడియు మిమ్ము
గోరిచూడవలెనంచు కలవరముగా నంపె సేవకులను

వ॥ వక్కనాడగస్త్య నాశ్రమమున కొక సేవకుడు వచ్చి పద్మావతీ శ్రీనివాసుల గని దుఃఖముతో స్వామీ మాప్రభువు ఆకాశరాజగస్మాత్తుగా జబ్బుచేసి కడుప్రమాదస్థితిలో నుండి మిమ్ములను జూడవలెనని కోరుచున్నారు గాన త్వరగా దయచేయుడన. ఆమాటలు విని పద్మావతి శ్రీనివాసులు.

గీ॥ శోకమందెడు పద్మతో శ్రీనివాసు
డా అగస్త్యులవారితో పయనమాయె
పురముజేరగ నృహలే కపరితపించు
రాజుగని పలకరించిన జూచియనియె.

వ॥ అగస్త్య మహాముని వెంటబెట్టుకొని తొందరగా నారాయణపురముజేరి స్పృహలేక పడియున్న ఆకాశరాజునుజూచి శ్రీనివాసమూర్తి వలుకరించినను ప్రత్యుత్తర మీయకున్నజూచి.

గీ॥ దుఃఖమున తల్లి బిడ్డ లెక్కెక్కి నేడ్చె
శ్రీనివాసుడు మదినెంతొ చింతజెంద
కొంతసేపున రాజు కన్నెత్తిజూచి
కూతునల్లుని గని పల్కె కూర్మితోడ.

వ॥ మరణావస్థలోనున్న ఆకాశరాజు ఎట్లో ఓపిక తెచ్చుకొని శ్రీనివాసునితో నిట్లనెను.

మంజరి

వాసుదేవ గోవింద మురారి పరమాత్మా హేపరంధామ
మురహరి యుపేంద్ర యిష్టరస్వహ ఫణిరాజశయన పుండరీకాక్ష
అధోక్షజా వనమాలి గదాగ్రజ పద్మశంఖచక్రాయుధపాణి
మురదమన పీతాంబర యటంచునిను ప్రతిపదమునన్ దయచేయవేడెదను
అంత్యకాలమున నిన్నుజూచాను ఆదివిష్ణు నాజన్మతరించెను.

వ॥ శ్రీనివాసా నాకే కోరికలేదు కాని నినొక్కటి ప్రార్థిస్తాను. నా కుమారుడైన వసుదానుడు, నా తమ్ముడైన తొండమానుడు ఏమీ తెలియనివారు వారిద్దరిని నీ కంటిరెప్పవలె కాపాడుము నాకదియే పదివేలు అని కుమార్తె పద్మావతిని దగ్గరచేర్చుకొని. అమ్మా నీవు లోకమాతవు. నీవలన నా వంశము తరించినది, సర్వసుఖముగా వర్థిల్లుమని పల్కి ప్రాణములు విడచెను.

మంజరి

ఆకాశరాజు ఆత్మలోనుండి ప్రకాశముగ నొకజ్యోతి
శ్రీకాంతునిలో లీనంబాయెను శ్రీనివాసుడిటు దెలిపెన్.

వ॥ అంత నందరూ గొల్లుమని ఏడ్చిరి. ధరణీదేవి భర్తపైబడి ఇట్లు దుఃఖించెను.

శివరంజని

హాపతీ నాపతీ నీ సతిగతి ఏదీ ।హా।
నాకిక ఏమీగతీ జూపితివి ।హా।
తల్లితండ్రి దైవము నీవేయని
యల్లవేళలందు నిన్నే నమ్మితి
కల్లగాదు నేను బ్రతుక జాలను
వల్లభా నిన్ను విడచి క్షణమైన ।హా।

వ॥ అంత శ్రీనివాసుడు, అగస్త్యమహాముని ధరణీదేవి నోదార్చి అమ్మా విచారింపకు.

శ్లో॥ ఋణానుబంధ రూపేణ పశుపత్నీ సుతాలయః
ఋణ క్షయం క్షయంయాత కాతత్రా పరవేదన.

వ॥ జాతస్య మరణం ధృవం బన్నట్లు పుట్టుట గిట్టుటకే గాన విచారింప వలదని, ఆకాశరాజునకు శ్రీగంధపు నింధనంబులతో కర్పూరాది సుగంధ పుష్పాలంకృతునిజేసి. దహన సంస్కారమొనర్చిరి. నంత దరణీదేవి పసుపు కుంకుమ పుష్ప సకల వస్త్రాలంకారియై భర్తకాష్టమునకు ముమ్మారు ప్రదక్షణము చేసి ఫలపుష్పాదులు పట్టుకొని జాజ్వలమై కాలుచున్న అగ్నిదేవునిలో దుమికి భర్తతో సహగమనము జేసెను.

మంజరి

దేవతలు పూలవాన గురిపింప పద్మావతి శ్రీహరియు
దైవనిర్ణయము దప్పదనుచు నగస్త్యాశ్రమము జేరుకొనిరంతా.

వ॥ దుఃఖించు పద్మావతిని నోదార్చి దైర్యముజెప్పి శ్రీనివాసుడు మరల పద్మా: తీదేవితో అగస్త్యాశ్రమముజేరి సుఖముగా నుండిరి.

(తొండమానుని పూర్వజన్మ వృత్తాంతము)

వ॥ పూర్వవైఖానసుడు అను భక్తుడుండెను అతడు కృష్ణభక్తుడు అతను శ్రీకృష్ణభగవానుని ప్రత్యేకముగా చూడవలెనను కోరికతో నిద్రాహారములు మాను కొని అఖండదీక్షతో తపస్సు ప్రారంభించెను.

అఠాణ రాగం

పాట

కృష్ణా యదుభూషణా గోవింద ముకుంద మురారి హరీశౌరి ।కృ।
నిష్ఠాగరిష్ఠుడనై నిను భజింతు కృష్ణా నీదర్శన మిమ్మా ప్రభూ ।కృ।
చ॥ సకలకాలముల నిన్నే నుతింపుచు అకలంక చరిత నిను దర్శింపగ
వికలకామకాంక్షలెల్ల విడచియు నింకనీపదమే దిక్కని గొలతును. ।కృ।

వ॥ ఇట్లు ఎన్నియో ఏండ్లు పట్టుదలతోచేయు తపస్సుకు శ్రీమహావిష్ణు సంతోషించి అతనికి ప్రత్యక్షమైయ్యెను.

గీ॥ శంఖచక్రగదా పద్మ శేషశాయి
చారుతరహస్త దేవతా చక్రవర్తి
దర్శనంబిచ్చి వరమును గోరుమనగ
నంతవైఖానసుడు జూచి సంతసమున

వ॥ వైఖానసుడు కనులు తెరచి స్వామిని దర్శించి భక్తిపరాధీనుడై భగవానుని ప్రార్థించి వినుతించె. స్వామీ మీ కృష్ణావతారము కనులారాచూస్తూ పూజింపవలెనని ఎన్నాళ్ళనుండియో వాంఛయున్నదనివేడ శ్రీహరి ఇప్పుడు కృష్ణరూపము చూడజాలవు. కాని శేషాద్రియందు శ్రీకృష్ణుడే శ్రీనివాసరూపముతో వకపుట్టలోనున్నాడు నీవాతని పూజించి తరింపుడు అని విష్ణుమూర్తి అంతర్ధానుడయ్యెను.

మంజరి

వైఖానస రుషియు సంతసంబున వేగశేషాద్రి కరిగెన్
మార్గమధ్యమున రంగదాసుడను భక్తువైఖానసుని గనీ

గీ॥ స్వామితామెక్కడికి పోవుచుంటిరనగ
శ్రీనివాసుని దర్శింప శేషాద్రి కేను
పోవలెనటన్న రంగదాస్‌స్వామినేను
గూడవచ్చెద పుష్పాలుతోడితెత్తూ
స్వామిసేవకు తోడుగా వత్తునసగా

వ॥ స్వామిసేవకు నేనూ తోడుగా వత్తుననగా వైఖానసుడు రమ్మన వారిద్దరు కలసి శేషాద్రి పర్వతమునకు ప్రయాణము సాగించి కొండపై నెక్కిరి.

గీ॥ ఘట్టవద్దకుజేరి నాపట్టలోని
శ్రీనివాసుని పూజింప నా రంగరాసు
విలచిపూజింప స్వామికి పుష్పములకు
పూలతోటను వెంబి పుష్పాలనిమ్మా.

వ॥ నీ వక పూలతోట నిర్మించి స్వామి పూజకు పుష్పముల నిచ్చుచుం డుము. పూలతో పూజించిన స్వామి సంతోషించి తొందరగా ముక్తివిచ్చును. రంగదాసు సంతోషముతో నొక బావిత్రవ్వించి పూలతోట నాటి నీరు తోడి పోయుచుండెను (అదియే పూలబావి) అని పేరు ప్రతిదినము స్వామిపూజకు పూలుదెచ్చి వైఖానసునకు యిచ్చుచుండెను. ప్రతి దినము పూజించుచుండెను.

మంజరి

గంధర్వరాజు తన భార్యలతో స్వామీ పుష్కరణిలోనా
జలక్రీడలాడుచుండ రంగదాస్ చిత్తచాంచల్యమున జూచెన్

గీ॥ స్వామి పూజను మరచి గంధర్వులేగ
తెల్విగొని పూలు గోసియు దెచ్చినిచ్చె
మునియు నాలస్యమేమన విన్నవించె
క్రీడలన్ దేలు గంధర్వ కారణమ్ము.

వ॥ వైఖానసమునితో రంగదాసు స్వామిపుష్కరిణిలో గంధర్వరాజు కాంతలతో జలక్రీడలాడుచుండ నేను మైమరచి నిలచినందున ఇంత ఆలస్య మైనది. నన్ను క్షమింపుడని పేడి పశ్చాత్తాపముతో శ్రీనివాసా నేనెంత పాపిని

గీ॥ మోహకాంక్షలలో బడి పూలు తేక
ఆలసించితి పాపుండ నీలదేహ
నన్ను క్షమియించి నీదర్శనంబు నిచ్చి
యెల్లకాలము బ్రోవుమా నల్లనయ్యా.

వ॥ పశ్చాత్తాపంతో శ్రీనివాసుని ప్రార్థింప స్వామి ప్రత్యక్షమై రంగదాసుడా విచారింపకుము. నీవు నా మాయామోహముచే గంధర్వ సుఖములపై భ్రాంతిజెందితివి. నీవు యీ శరీరము విడచి నారాయణపురమున సుధర్మరాజునకు కొమారుడపై జన్మించి తొండమానుడను పేరున రాజ్యసుఖము అనుభ వించుమని చెప్పెను. ఆ రంగదాసుడే ఆకాశరాజుకు తమ్ముడైన తొండమాను డుగా జన్మించెను.

(తొండమానుడు వసుదానుడు రాజ్యమునకై కలహించుట)

ఆదితాళము

వినుడు వసుదాను తొండమానుల జగడము
వినుపించెద మీకు వీనులకింపుగ ।వి।
గనుడు ఆకాశరాజు కైవల్య
మునుజేర యనంతరము కొడుకు పినతండ్రి ।వి।
రాజ్యకాంక్షతో నావురువురు కడు దు
రాశపరులై పెద్దలు జెప్పిన ని
రాకరించియు దురాక్రమణమున
రాగద్వేషులై నాగ్రహంబునన్ ।వి।

వ॥ ఆకాశరాజు అనంతరము రాజ్యపాలనకై ఆకాశరాజు తమ్ముడు తొండమానుడును, ఆకాశరాజు కొడుకు వసుదానుడు కలహించిరి. తొండమానుడు సభవారిని పిలిపించి యిట్లనెను.

ఉ॥ అన్న అనంతరంబు మరి నెన్నగ తమ్ముడే రాజుగావలెన్
కన్నకుమారుడెట్టి ఘనకార్యము లెరుగని బాలుడౌటలీ
యున్నత రాజ్యమేలగల యర్హత చాలదు గాన తమ్ముడన్
యన్నగ రాజ్యమేలుదు యనంతర మీతనికిత్తు నమ్ముడీ

వ॥ బాలుడు ప్రయోగోప సంహార వ్యవహారములు తెలియనివాడు వసుదానుడు గాన అన్న యనంతరము తమ్మునిదే రాజ్యాధికారమున్నదని తొండమానుడన వసుదానుడిట్లనెను.

చ॥ తనయుడె తండ్రిలేనితరి ధారుణినేలుట ధర్మమౌను నీ
వినయ విధేయతన్ గనెద వీడుము నీదగుదుడుకు మాటలన్
ఒనదిక తండ్రి పుత్రునితో చేయగవైరము చేటుగల్గు
నా మనవి గ్రహించి శాంతిగను మారణహోమ ముపక్రమింపకన్

వ॥ తండ్రి అనంతరము తనయునిదే రాజ్యభారము గాన పినతండ్రివి పితృసమానుడవు నిన్ను గౌరవ మర్యాదలతో పోషింతును గాన దీనికి సమ్మతించుమని వేడుకొనెను. అంత తొండమానుడు కోపించి.

పాట

గ్రుడ్డువచ్చి పిల్లనెక్కిరించిన మూఢునిగతి నాకెదిరించ విటు
దొడ్డధర్మములు చెప్పుచుంటివిటు గడ్డివాడ నేజాలును చాలింపు ॥గృ॥
పెద్దపిన్న తారతమ్య మెరుగని పిల్లవాడ నోర్మూసికొనకిట్లు
బద్ధవైరంబు దెచ్చుకొనకు మీ యుద్ధమునగూలుటే తథ్యంబగు ॥గృ॥

వ॥ ఓసభికులారా మీరైనా న్యాయముచెప్పి మా జగడము నివారించుడని తొండమానుడు చెప్ప.

ఉ॥ కొందరు తొండమానుడను కోరికదీర్చుటె సమ్మతంబనెన్
కొందరు రాజపుత్రునకె గోరగ నర్హతనున్నదంచనెన్

కొందను ర క్తపాతమగు ఘోరరణంబును మాని సమ్మతిన్
యందరు క్షేమశాంతులతో నాదరమొప్ప జరింప మేలనెన్

వ॥ ఇట్లు వారివారికి తోచిన పలహాలు చెప్పిరి కాని వసుదానుడు ఆగ్ర హించి. మీరు సందిగ్ధముగా గోడమీదిపిల్లి వాటముగా మాట్లాడుచుంటిరి.

మంజరి

రాచబిడ్డడై పుట్టి నందులకు రాజ్యమేలుటే పుషార్థంబగు
రాచపాడిదప్పి బిచ్చమెత్తగ రాయగాయనౌ పిరికి బంటునే

వ॥ సుక్షత్రియ వంశంలోబుట్టి సిగ్గు ఎగ్గులు విడిచి దేహీయని వకరి నాశ్రయించుకొందునా యనిన. తొండమానుం డుగ్రుడై పినతండ్రి యాజ్ఞ నాదరించుట నీకవమానమా ఏమీ నీబాల్య చాపల్యము ఏమీ నీమూర్ఖము.

ఉ॥ ఖండన భూమిని త్తపెటు బాలుడవీవు మహాబలుండనే
కొండ నెదిర్చి ఢీకొనెడు కొక్కెరి కేగతియౌనొ నక్కటా
మొండితనంబు మానుకొని మోదముతో నిక సమ్మతించుచీ
గండరగండవై నిలువ ఖండనజేసెద ఖడ్గధారచే

వ॥ నామాట గ్రహింపకున్న నీవు నీసైన్యములు నాశమందుట నిజము ముందువెనుకలు విచారించుకొనక మూర్ఖంతో నెదిరించి సర్వనాశనమైన తరువాత చేతులు పిసుకుకొన్న లాభములేదన. వసుదానుడు కోపించి పినతండ్రివని పెద్దగా గౌరవింప నీగర్వ మధికమాయె. మాటిమాటికి బాలుడవేమి చేయగలవని పరుషములాడుచున్నావు కాని.

ఉ॥ బాలుడు బాలుడీతడని బాకలు నూదెదవేల పోర నీ
పాలిట కాలుడీతడను భావమెరుంగక గర్వమందువా
చాలత కట్టిపెట్టు నిక శాంతిని సమ్మతి జెందకున్న నీ
కాలముదీర్చి సర్వజన కాంక్షతో నిర్మల రాజ్యమేలెదన్.

మంజరి

అనియిటు నిర్వురు నెవరుచెప్పినన్ వినిపించుకొనకపోవన్
జనె కంఠశోషబడి చెప్పనేల యనుకొని వారల విడివిన్
సభనుండిలేచి తొండమానుడున్ గభాలునన్ జనెన్ పురికిన్
తమాయించి యోచించి శేషగిరి తానుగన శ్రీనివాసున్.

గీ॥ మదికి శ్రీ శ్రీనివాసుడు జ్ఞప్తికొచ్చి
సాయమును గోరగానేగ సత్కరింప
శ్రీనివాసుడు నిదురలో నున్నయట్లు
దొంగ నిద్దురలోనుండ దూరమేగి.

మంజరి

అంత వసుదాను డశ్వంబునెక్కి అగస్త్యాశ్రమముజేరీ
అందు నిద్రించు బావపాదముల్ భక్తితోడ పూజించీ
అంత దిగ్గునన్ శ్రీనివాసుండు సంతసమ్ముతోడలేచీ
వింతగా పలికె బావమరదితో వంతలాడెను హసించీ.

వ॥ అగస్త్య ఆశ్రమముచేరి నమస్కరించిన ముద్దుల బావమరది భక్తికి సంతసించి నిద్దురలేచి దిగ్గున వసుదాను కౌగలించి శ్రీనివాసు డిట్లనె,

ఉ॥ ఎక్కడనుండి వచ్చితివి నెల్లరున్ సుఖులేగదాపురిన్
చక్కగ సర్వబంధుజన సఖ్యతతోడుత గూడి క్షేమమై.
మక్కువ తొండమానుడగు మీ పినతండ్రియు ప్రీతిజూచునే
నిక్కముదెల్పు నాకతకు నీవరుదెంచిన కారణంబికన్.

వ॥ ఇట్లు ప్రియమార క్షేమములడుగుచుండ శ్రీనివాసుని కంఠధ్వనివిని తాను కూడా వచ్చి శ్రీనివాసుదర్శింప శ్రీహరిజూచి ఓహో నేడు ఎంతసుదినము.

గీ॥ చిన్నమామవు నీవు నాచెంతజేరి
వచ్చితిరి క్షేమమేగదా మంచిదాయె

కష్టములులేక నెల్లరుదీక్షతోడ
పురము పాలించుచుంటివే పుణ్యచరితా.

వ॥ చిన్నమామగారు వచ్చినదే శుభదినము. ఊరకేరారు ఏదోకార్యార్థులై వచ్చినట్లు తోచుచున్నదని అందరిక్షేమములు విచారించి, మామా తణరంగభీమా నీరాకను కారణంబేమాయని ప్రశ్నింప తొండమాను డిట్లనె.

గీ॥ ముందుగావచ్చి చూచితి నిదురలోన
నుంటివని శేషగిరినెక్కి మింటినుండి
నెల్లవన చిత్రములజూచి చల్లగాను
జేరితిని నీదు సాయము గోరికొనగా.

మంజరి

బాలుడవు నేను పితృసమానుడ పాలింతు రాజ్యమనగా
పాలింప చేతగానివాడనే చాలింపు పిరికినిగా
తలచితేమొ నాతండ్రి హక్కు నీ వలిగిన భయపడబోనూ
ప్రల్లదంబులేల బల్కు యుద్ధమే నెల్లనిచ్చమనెతాను.

వ॥ అన్న అనంతరము నున్న తమ్ముడే రాజ్యమేల నర్హుడని నెందరు పెద్దలు చెప్పిన వినక తండ్రియనంతరము తనయునిదే రాజ్యముగాని నీకెట్టి అర్హతలు లేవని మూర్ఖమున నన్నెదిరించి పోరాడ సిద్ధమైనాడు గాన, శ్రీనివాసా నీవు నిష్పక్షపాతివి. నీసాయము గోరుకొన ముందే వచ్చాను నీ అభిప్రాయ మేమియన.

గీ॥ ముందె వచ్చితివీవు మున్ముందెజూచి
యుంటి వసుదానినునిన్ గంటినిట్టి యడల
హితులు బంధువులు మీరు నాభక్తులంచు
ఇద్దరుఁ రెండునేత్రాలు భేదమేల

ఉ॥ నీవిటు చిన్నమామగద నీతియశస్కుడవైన పెద్దవే
జావిత సర్వసద్గుణుడు బాలుడు బావమరంది నీతడుఁ

దైవిక దృష్టితో సరిగ ధర్మముతోడ సహా మిర్వురున్
కోవిద కోరుకొండునిక గోరగ బాలున కొప్పుముందు గ॥.

వ॥ మీరిద్దరూ నాకు సమానులే గాన నీవు సర్వ అనుభవము నాశితేరిన మాకు పెద్దవు యితడు తండ్రిలేనివాడు తెలియని బాలుడు నాకు ముందే కన్పించినాడు. వాడు ముందుకోరిన పిదప తక్కినది నీకెదక్కును.

గీ॥ శంఖచక్రము లొకట నే నొక్కవైపు
బుద్ధికిన్ దోచు సాయము బోధచేతు
శక్తికొలదిగ యుద్ధము జేతుగాని
పక్షపాతంబు నోపనే బాప మామా.

మంజరి

ఆమాటలు విని తొండమానుడున్ ఆశ్చర్యమున గుందన్
నీమాటయె సరి కోరుకొనుమా నీ యిష్టమెటులో గొనెదన్.

వ॥ శ్రీనివాసా నీ యిష్టమెటులో అటులనే కోరుకొమ్మనుమన శ్రీనివాసుండు వసుదానుని చూచి కోరుకొమ్మన వసుదానుడు.

ఉ॥ సుందరమైన శంఖమును శోభితశక్తి సుదర్శనంబులే
చందములైన శస్త్రములు సైన్యము లక్కరలేదు నాకు నో
శ్రీధర తోడు నీడగను చెంతవసించిన చాలు శత్రులన్
యుద్ధమునందు చిత్రవధ నొయ్యన జేతును శ్రీనివాసుడా.

వ॥ అంత శ్రీనివాసు డెవ్వరినీ కాదనజాలక.

మంజరి

శంఖచక్రములు తొండమానునకు శ్రీనివాసుడుణ నిచ్చెగ
స్వీయముగా బావమరదియైన వసుదాను పక్షమ్ము జేరెన్.

వ॥ శ్రీనివాసుడు శంఖచక్రములు తోడుగా తొండమానునకిచ్చి. తాను బాను బావమరదైన వసుదానుని పక్షముగ యుద్ధమునకు బోయెను.

(యుద్ధ రంగము)

ఘోరఘోరమను ప్రతిధ్వనులతో
ఘోరనశంఖా రణభేరీలతో
వర్షపాతముగ శస్త్రాస్త్రాగ్నితో
భగ్గున దగ్ధములైన సేనలతో
నక్కలు కుక్కలు రాబందులతో
దిక్కుమాలిన గ్రద్దకాకులతో
తాండవమాడె భూతాదిపిశాచములు

సీ॥ ఒకవంకలో తొండమానుని సైన్యంబు
ఒకవంక వసుదాను సేనజుట్టె
ఒకచోట కాహళపణవ భేరీ రవమ్ము .
లొకచోట ఖరగడ్గ మఖిల శరము
ఒకచోట మదగజాశ్వము రథములొంటె
యుద్ధయోధుల ఘోర రక్తధార
ఒకచోట ముష్టియుద్ధాంగ ఖండంబులు
శిరశల్య నరచూర్ణ శిథిల శవము

గీ॥ కరము శిరసులు తెగిపడె దురములోన
రథగజాశ్వములు భటుసైన్య దగ్ధమయ్యె
అల్లకల్లోలమై సేనలెల్లగూలె
పృథమి రక్తపు కాల్వల మడుగులాయె.

వ॥ యుద్ధము చాలా ఘోరముగా జరుగుచుండెను. అది కౌరవపాండవ యుద్ధముకన్నా ఘోరముగా జరిగి ఉభయసైన్యములు చాలవరకు హతమయ్యెను. నా యుద్ధసమయములో తొండమానుడు మహా పౌరుషముతో శ్రీనివాసునెదిరించి గొప్పబాణములతో పోరాడుచుండ శ్రీనివాసుడును పంతముతో పోరాడుచుండ.

గీ॥ కొంతవడి ఘోరముగజేసి యుద్ధమందు
తొండమానుడు బలమైన బాణమేయ

శ్రీనివాసుని వక్షము చీల్చినట్లు
మూర్ఛబడె శ్రీనివాసుండు మూర్ఛచేత.

వ॥ తొండమానుడు బలమైన బాణము శ్రీనివాసునిపై విడువ. అది రొమ్మున కుమ్మ శ్రీనివాసుడు మూర్ఛిల్లెను. ఆ సంగతి పద్మాదేవికి తెలిసి విచారముతో అగస్త్యమహామునిని వెంటనిడుకొని యుద్ధరంగముచేరి మూర్ఛిల్లిన స్వామికి చల్లని ఉపచారముచేసి సేదదీర్చుచుండ.

గీ॥ దిగ్గునన్ లేచి శ్రీహరి యగ్రు డౌచు
యుద్ధమున మూర్ఛపడెనంచు యుద్వేదేల
చక్రధారచే నీ శిరము చండివైతు
నకట తనచేత చక్రంబు లేకపోయె.

వ॥ శ్రీనివాసుడు కోపముతో తొండమానునిపై చక్రప్రయోగము చేయబోవ. శంకచక్రములు తొండమానునకిచ్చిన విషయము జ్ఞప్తికివచ్చి నీ అదృష్టం మంచిదాయె ఈ సమయానికి నాచేత చక్రములేకపోయెనే యని పద్మావతీదేవిని చూచి దేవీ యీ రణరంగమునకు నీవేల వచ్చితివనన. పద్మావతీదేవి ఏడ్చుచూ నిట్లనియె.

రూపకం

రణరంగము ప్రళయముగా రగులుచుండె ప్రాణేశ్వర
రధమదగజ తురగ సేనలు రక్తపాతమై కూలెను
ఇరుపక్షంబుల నొక్కరు మరి పినతండ్రియు తమ్ముడు
నిరువురిలో నెవరికేని మరి హానియు గలుగనీకు ॥ర॥

వ॥ స్వామీ యుద్ధము ప్రళయమై యిరు సైన్యములు తెగిపడి రక్తపాతమైనది గాన పకరు పినతండ్రీ మరొకరు తమ్ముడు ఇద్దరిలో ఎవరికి హానికలిగినా నాకు దుఃఖమే గాన దయయుంచి వారికి సంధిచేసి మా పుట్టింటి వంశము నిల్పుడు అని ప్రార్థించెను.

మంజరి

వెక్కివెక్కేడ్చి సంధిచేయమని వేడుకొనగ శ్రీహరియు
పద్మమాటలకు జాలిజెందియున్ పరామర్శించి యనియెగా

వ॥ పద్మయు అగస్త్యమునియూ అనేక విధంబుల శ్రీనివాసుని వేడుకొన శాంతించి తొండమానుని పిలచి ఓయీ మీ ఉభయులకు సంధిచేయ తలంచితిని నీ అభిప్రాయమేమన నమస్కరించి.

గీ॥ ఓ జగన్నాథ దాసుండ నీయాజ్ఞయైన
నెదురు చెప్పను నీదయ నెట్టులైన
సమ్మతింతును తడవేల స్వామి త్వరగ
సర్వజన రక్షణమె నేను గోరువాడ

వ॥ శ్రీనివాసుడు వెంటనే సుదానుని రప్పించి నాయనా వసుదానా యుద్ధం మంచిదిగాదు. తండ్రి కొడుకుల తగవు ధర్మహాని, వంశనాశనముచేయును గాన మీ ఇద్దరకునూ సంధిచేయ నెంచితిని. ఏమందువన వసుదానుండు.

గీ॥ దేవ నినుజూపి చనిపోయె తల్లితండ్రి
సర్వభారంబులకు నీవె సాక్షివంచు
రక్షకుడవంచు నీపాద దీక్ష వేడి
నెద్దిజెప్పిన వినెద మహానుభావా.

వ॥ మహానుభావా నే బాలుడను మంచిచెడ్డ లెరుగని వాడను. మా తండ్రి ఆకాశరాజు చనిపోవుచూ నన్ను మీ చేతిలో నుంచినాడు. నా మంచి చెడ్డలు మీవే మీ ఆజ్ఞ కెదురాడువాడనుగాను మీ ఇష్టము వచ్చినట్లు సెలవిండని పల్కెను.

మంజరి

శ్రీనివాసుండు వారికి రాజ్యము సమానముగా పంచిచ్చి
పినతండ్రి కొడుకు కౌగలించుకొనె ఆనందంబున వచ్చి

వ॥ శ్రీనివాసుడు వారిద్దరకు రాజ్యము సమానముగా పంచియిచ్చెను. వారిద్దరు కౌగలించుకొని కోపములు మాని సంతసించి ఆడబిడ్డకు అరణముగా తమ రాజ్యమున ముప్పదిరెండు గ్రామములు యిచ్చిరి. ఆనంతరము శ్రీనివాసుండు పద్మావతితో అగస్త్యుని ఆశ్రమము జేరిరి.

(తొండమానుడు శ్రీనివాసున కాలయము నిర్మించుట)

పాట చతురశ్ర

కౌన్నాళ్ళకు పద్మ శ్రీనివాసుల కన్నారజూడ తొండమానుండు
జని నగస్త్యాశ్రమున జేరినంత గని పద్మావతి శ్రీనివాసుఁడున్ ।కొ
మీరలిన్ని దినములకు వచ్చితిరి మీరాకకు కారణంబదేమని
పరమప్రీతి గౌరవించి బల్కగ పరమ భక్తితోడ నిట్లుబల్కెను ।కొ

వ॥ అగస్త్యముని ఆశ్రమమునకు వచ్చిన తొండమానునిజూచి పద్మావతి శ్రీనివాసులు సకల మర్యాదలతో గౌరవించి అందరిక్షేమములు విచారించి, వచ్చిన కారణంబేమని యడుగగా తొండమాను డిట్లనెను.

మంజరి

హే పరంధామ లోకరక్షకా రమారమణ నారాయణా
సర్వజనప్రియ దివ్యమంగళా రూప నిన్ను దర్శింప వచ్చితిన్.

వ॥ స్వామీ నారాకకు విశేషము లేమిలేవు భక్తరక్షకుడవైన నిన్నుచూచి సేవించిపోవచ్చితిని. నీ దివ్యమంగళ విగ్రహము ఎన్నాళ్ళుచూచినను తనివి నొందకున్నాను. నీపాద సేవకన్న ఇతరమైన గొప్పపని ఏమియూలేదు. నీపాద దాసునిపై ఎల్లప్పుడును దయయుంచుడని సాష్టాంగ దండప్రణామ మాచరింప శ్రీనివాసుడు తొండమానుని లేవనెత్తి ప్రేమతో నిట్లనెను.

గీ॥ స్వామి చిరునవ్వుతో బల్కె భూమిపాల
నీవు నాకొక కోరిక దీర్పవలయు

ననగ తన చెయ్యి చేతిలో నంతవేసి
కోరు మేదైన నిత్తునో కోమలాంగ.

మంజరి

కరిరథాశ్వములొ పురసౌధములొ వజ్రనవరత్నహార భూషణలో
సర్వకంకణ కుండల కిరీట తారహారములో నాప్రాణముతో
కోరుడిత్తునని కోరివచింపగ గోరెనిట్లు సంతోషముగా

వ॥ తొండమాను డుత్సాహంగా చేతిలో చెయ్యివేసి కోరినదిచ్చెదనన. శ్రీనివాసుండానందించి, నీ అన్నయైన ఆకాశరాజు బ్రహ్మచారిగానున్న నన్ను పిలచి బిడ్డనిచ్చి పెండ్లిగావించి గృహస్తునిచేసినాడు. కాని నాకు ప్రపంచంలో నివసించుటకు గృహములేదుగాన నీవు నాకొక ఆలయము గట్టించి పుణ్యమొందుము. నీ ఉపకారమెన్నటికి మరువజాలనన. స్వామీ ఈదాసునకు అంతకన్న కావలసినదేమున్నది.

గీ॥ ఎందు మీరుండ ఇష్టమో అందు మీకు
ఆలయమును గట్టింతు నాజ్ఞనిండు
యన నగస్త్యునియాజ్ఞ నొందివేగ
పద్మ శ్రీహరి రాజు శేషాద్రి జేరె.

వ॥ స్వామి పద్మావతీ తొండమానుతో శేషాద్రిజేరి రాజా ఈ స్థలము వరాహస్వామిచే నాకివ్వబడినదిగాన ఇందు స్వామిపుష్కరణి వెంబడి తూర్పు ముఖముగా ఆలయము గట్టింపుము. గోపురముల ప్రాకార సింహద్వార ధ్వజస్తంభం ఆస్థాన మంటప గోశాల ధాన్య వంటశాలలు మొదలగునవి ఏర్పరుపుము ఇచ్చటగల పూలబావి సిథిలమైనది దీని మరల కట్టింపుమనెను.

గీ॥ స్వామినాజ్ఞను పిలిపించె శిల్పఘనుల
సకల గోపుర ప్రాకార చలువ నిలయ
మంటపంబులు పూదోట మంచి నీటి
బావి కొలనులు సత్రముల్ బాగగట్టె

వ॥ తొండమానుడు శ్రీనివాసుని పల్కులకానందించి ఆలయ నిర్మాణమునకు దగిన వస్తువుల పనివారి మహాశిల్పుల రప్పించి కొద్ది దినములలో ఆనందనిలయ ప్రాకార గోపురమంటపాది పైకి క్రిందికి నెక్కుటకు దిగుటకు మెట్లు గట్టించి పూలబావి కొలనులన్ని మరమత్తులుచేయించి రెండవ వైకుంఠ మందిరముగా ఏర్పరచి శ్రీనివాసునకు తెలియజేసెను.

గీ॥ తొండమానుభక్తికి సంతోష మంది
బ్రహ్మ దేవత వైష్ణవ భక్తవరుల
వేదవేదాంగ వేదుల బ్రాహ్మణులను
వేగరప్పించి శుభముహూర్తమందుజేర.

వ॥ ఆనందనిలయ మందుజేర సుముహూర్తము ఏర్పాటుచేయ ఆ వేడుక చూచుటకు సమస్తలోకములవారును వచ్చిరి. ముహూర్తసమయమునకు పద్మావతీ శ్రీనివాసులు అలంకారము లొనర్చుకొని మంగవాద్యములు మ్రోగుచుండ బ్రాహ్మణులు వేదమంత్రములు చెప్పుచుండ మహామునులు దీవెనలు చేయుచుండ దేవతలు పుష్పవర్షము గురిపింప. అప్సరి నాట్యమాడుచుండ. జయజయ శబ్దములతో ఆదివ్య ముహూర్తమున ఆనందనిలయమున పద్మావతీ శ్రీనివాసులు ప్రవేసించిరి.

సీ॥ నిగనిగన్ వెల్గెడు ముఖద్వార మంటప
కళ్యాణ వేదికల్ కనక పీఠం
తళతళన్మెరసెడు ద్వారసప్తకిస్వర్ణ
శిఖర గోపుర ధ్వజస్తంభ జ్యోతి
ఘణఘణధ్ఘంటికల్ ఘనవేదపఠనాదు
లగ్నిగుండము వంటశాల తిన్నె
ఘుమఘుమత్సుమగంధ నవరసపరిమళ
శేషాద్రిస్వామి పుష్కరణిచెంత,

గీ॥ జలజలన్ బారు జలయంత్ర కొలనులెన్నో
భక్తులకు ధర్మసత్రము ల్వాసతిగృహము

వాహనంబులు కడు శబ్దగ్రహణమెల్ల
రంగురంగుల గోళములుల్ నెక్కుమెట్లు
కట్టడంబులు నిర్మించె మునులుమెచ్చ
తొండమానుడు స్వామికర్పణముజేసె

వ॥ అంత బ్రహ్మదేవుడు శ్రీనివాసునితో సహానుభావ.

మంజరి

ఆదిమధ్యాంత శ్రీలక్ష్మీనాథ మదినొక కోరికగలదిదీ
నీ దయాదృష్టితోడ తీర్చవలె మదనజనక యన నవ్వి

వ॥ శ్రీనివాసుడు నవ్వి ఏకావహా నీవు నాకు ప్రేమపాత్రుడవు నీకోరిక మానవ కళ్యాణమునకేగాని వేరుగాదు గాన కోరుకోమన బ్రహ్మదేవుడు సంతోషించి స్వామీ నీ నిలయమైన ఈ శేషాద్రిని నెవరెక్కుదురో వారి పాపములు బోవునట్లు వరమిమ్మనెను శ్రీనివాసుడట్లే యనెను.

వ॥ వేం, అనగా పాపములు కట. అనగా పోగొట్టునది గనుక ఆనాటి నుండి యాకొండకు వేంకటాచలమని పేరు గలిగినది. వేంకటాచలమునకు ప్రభుడై నివసించుటచే స్వామికి వేంకటేశ్వరుడు అను నామముగలగెను.

గీ॥ బ్రహ్మదేవత మునిజన బృందమెల్ల
సకలజల పుణ్యతీర్థ పుష్కరిణిలోన
శేషగిరినెక్కి మున్గి దర్శించువారి
పాపముల్ దీర్చి గాపాడ స్వామియొప్పె

వ॥ స్వామి తథాస్తుయన. బ్రహ్మదేవుడు స్వామీ.

మంజరి

మీదు సన్నిధిలో అఖండజ్యోతులను వెల్గింతు లోకకళ్యాణమగున్
మీసన్నిధిలో కలియుగాంతమ్ము వరకు భక్తులకు వెల్గనిడున్

వ॥ స్వామి సన్నిధిలో రెండుజ్యోతులు వెలిగింతును. ఆ జ్యోతులు లోక కళ్యాణార్థము కలియుగానంతము వరకు వెలుగుచుండును. నీ భక్తులకు సిరిసం భాగ్యమిచ్చి కోర్కెలు దీర్చి తరింపచేయుచూ నే వేయు బ్రహ్మోత్సవముల కంగీకరించి నాకోర్కె నెరవేర్చుమన వేంకటేశ్వరుడు అంగీకరించెను.

తోహర

బ్రహ్మ తొండమానునితో జెప్పగ విశ్వకర్మను పిలిపించి
ఉత్సవంబునకు వలసిన రథములు వాహనములు గొడుగులను
చామరంబులన్ మకరతోరణము సర్వముసిద్ధము చేయుమనెన్
విశ్వకర్మ బంగారు నవరత్నములను పొదిగి నిర్మించెన్
శే హంస సింహ వాహనాదుల చిత్రశిల్పములతో జేసెన్.

వ॥ విశ్వకర్మ బంగరు వెండి తామ్రాదులచే శిల్పముల చిత్రవిచిత్రముగా చెక్కి సిద్ధముజేయ తొండమానుడు సమస్తదేశాధీశులగు ప్రజలకు ఆ దివ్య బ్రహ్మోత్సవము జూచుటకు రమ్మని మహోత్సవ వార్తాపత్రికలంపెను.

సీ॥ ధగధగత్కాంతులఁ జెన్నగడునిసేధిని
రమణీయ గోపుర ప్రాంగణములు
ఘణఘణాద్ఘంటికా ఘనవేదపారాయణ్
స్వర్గశిల్పిత ద్వార సప్తకములు
జిగజిగన్వెలిగెడు జ్యోతిగోళమ్ములు
చిత్రవిచిత్రమౌ శిల్పకళలు
ఝణఝణన్మంగళ కళ్యాణవాద్యాది
మంత్రనాద మకుట ముత్యమణులు

గీ॥ నిటల నవరత్న వజ్రకిరీటహస్త
కర్ణకుండలి కవచ కంకణమణీంద్ర
శ్రీలకౌస్తుభకేయూరగళ సుమాల

హార శ్రీదేవి భూదేవు లురము మెరయ
వెంకటాచలమెంతయో వేడ్కజూడా.

వ॥ ఉత్సవదినమునకు వేంకటాచలమంతయూ యిసుకేసిన రాలనంత జనసమూహముతో నిండిపోయెను. ఆశ్వయుజ శుక్లపాడ్యమి మొదటిరోజు అంకురార్పణ రెండవరోజు ధ్వజారోహణము. మూడవ రోజు శేష, హంస నాల్గవరోజు సింహ, ముత్యాల పందిరి. ఐదవరోజు కల్పవృక్ష, సర్వభూపాల ఆరవరోజు మోహినీ అవతారము, గరుడసేవ. ఏడవరోజు హనుమంత, ఏనుగు ఎనిమిదవరోజు సూర్యప్రభ, చంద్రప్రభ. తొమ్మిదవరోజు రథోత్సవము చక్రము. పదవరోజు ముత్యాలపల్లకి యుత్సవము స్వామిపుష్కరిణీ తీర్థమున అవభృథస్నానము. ఈవిధముగా పగలు రాత్రులూ మహావైభవముగా బ్రహ్మోత్సవములు జరుగుచుండ భక్తులందరూ స్వామిని దర్శించి గోవిందనామ స్మరణ చేయుచూ తమ తమ శక్తికొలది స్వామికి కానుకలు చెల్లించి కొబ్బరికాయ ఫలపుష్పము అర్పించి మహామంగళహారతులిచ్చి, తమ తమ యిండ్లకుజేరిరి. బ్రహ్మ స్వామియాజ్ఞగొని సత్యలోకముజేరెను. తొండమానుడును తన రాజ్యము జేరి సుఖసంతోషములతో నుండిరి.

సీ॥ పకమూల గుంపులై పెకలి పసుల్జేయు
కోతి సంఘముల సంకుచితయుక్తి
పకకేల పాంథుల కొంగి చాకిరు లొనర్చు
చో వివాహకుల వాచాల శక్తి
పకిచెంత మొక్కుబళ్ళకు దోడులై నేగు
యు విధాష తల్లుల కొనరు శక్తి
పకివాడ వైష్ణవప్రకర సంతతులకు
నౌన్నత్యమును జూపు నట్టిరక్తి

గీ॥ అన్నితాగాంచి పద్మకు విన్నవించు
నట్టి శ్రీవేంకటేశుకీయ లఘుచరిత
విన్న భక్తుల కాయువు సిద్ధిపొంది
వియనొసగుగాత మాసంద్రతారకముగా.

(లక్ష్మీదేవి పద్మసరోవరమున వెలయుట)

తోహర

శ్రీ లక్ష్మీపద్మావతులతో శ్రీనివాసుడొకనాడు
ఆలసినట్లుండ నాలక్ష్మీదేవి వెలవెలబడి హరినడుగెన్
సకల ఐశ్వర్య సంచారములతో సంతోషింపక సిటులన్
చింతజెందుటకు కారణమేమన శ్రీనివాసుడిటు జెప్పెన్.

సీ॥ నా వివాహమునకు యువిద కుబేరుని
వద్ద నప్పుదీసినందుచేత
ఆ ఋణంబెట్లుల దీర్చుదునాయని
మార్గంబుదోచక క్రుగ్గుచుంటి
ప్రతి వత్సరంబును వడ్డిచెల్లింతని
పత్రంబు వ్రాసియిచ్చితిని గాన
నీవు నాకు కొంత యుపకారమును జేయ
వలసియుండె నీవు కలియుగాన.

గీ॥ భక్తులకు భాగ్యములనిచ్చి భాగ్యగర్వ
పాపకర్మల వ్యాధి నాపదలు గల్గ
జేసి మ్రొక్కుల మ్రొక్కింప జేర్తురొడ్డి
నిల్వదోపులతో దీర్తువింక ఋణము

మంజరి

అని దెల్ప లక్ష్మి పద్మసరోవరమున వెలసి భక్తజనులకా
గని రక్షింపుము నీ నిజరూపము నా వక్షంబున నుంచెకా

వ॥ నీవు కలియుగమున నా భక్తులకు భాగ్యములిచ్చి ఆపదలు గలుగ జేయుము. అప్పుడు నన్ను రక్షింప వేడుదురు. నే ముడుపులుగట్టి వడ్డికాసులు నిలువదోపులు చెల్లించిన వారి నాపదలనుండి కాపాడెదను. ఆ వడ్డికాసులు ప్రతి సంవత్సరము కుబేరునకు కలియుగాంతము దాకా చెల్లించి అనంతరమతని అసలు దీర్చి మనము వైకుంఠముజేరి సుఖముగా నుండవచ్చును. నీ వంతవరకు

పద్మసరోవరమున వెలసి భక్తుల రక్షించుచుండుము. నీవు నన్నెడబాయకుండా నీ నిజ స్వరూపము నా వక్షమునసేయుంచి నీ యంశము మాత్రము అచ్చట వెలయింప జేయుమనెను. లక్ష్మీదేవి స్వామి మాటలకు సంతోషించెను. వేంకటేశ్వరుడు లక్ష్మీదేవిని కౌగిలించుకొని తన వక్షస్థలమున జేర్చుకొనెను.

మంజరి

బ్రహ్మాది దేవతల రావించియు విశ్వకర్మతో జెప్పి
శుకాశ్రమమున పద్మసరోవర సమీపమున మందిరము
నిర్మింప సుముహూర్తమున లక్ష్మీదేవిన్ ప్రవేశింపజేసె శుకునితోన్

వ॥ శ్రీనివాసమూర్తి బ్రహ్మాది దేవతల బిల్పించి శుకాశ్రమంవద్ద పద్మ సరోవరము ప్రక్క నొక దివ్యమందిరం నిర్మింపజేసి శుకమునితో నీవు యీ క్షేత్రమున వక అగ్రహారమునుంచుమని జెప్పి జనిరి, శుకుడట్లేయని జేసెను.

(కూర్మదను బ్రాహ్మణుని చరిత్ర)

తొండమానుడు ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడుచు శ్రీ వేంకటేశ్వరుని నామస్మరణము మరువక ధర్మముగా రాజ్యమేలుచుండెను.

కూర్మదను నొక బ్రాహ్మణుడు తన తండ్రి హస్తులను కాశీక్షేత్రమున గంగలో కల్పుటకు తన భార్యా పుత్రుని వెంటబెట్టుకొని యాత్రలకు బయలుదేరెను నై దేండ్ల కుమారుడు గర్భవతియైన భార్య నడువలేక బాధపడుచుండ దారిలో తొండమానుని పట్టణము కన్పింప పట్టణంచేరి బ్రాహ్మణుడు తొండమానుని కీర్తి విని రాజాస్థానమునకు పోయి రాజా.

మంజరి

బ్రాహ్మణుండ నాదు పెద్దలస్థులను గయలో గంగలో కల్పగను
బోవుచున్నాను కాశీయాత్ర నా భార్య గర్భవతి గాన,

వ॥ రాజా నేపెద్దల అస్థులు గంగలోగల్ప కాశీయాత్రకు బోవుచున్నాను నాభార్య గర్భవతి నా కైదు సంవత్సరముల కొడుకు వీరు నడువలేకున్నారు. గాన నీవు ధర్మప్రభుడవని వచ్చాను.

గీ॥ కాశినుండియు నే తిరిగి వచ్చువరకు
కొడుకు భార్యను మీకొప్పగించిపోదు
వారి పోషించి నే తిరిగి వచ్చినంత
నప్పగించుము రాజ ప్రార్ధించుచుంటి

వ॥ తొండమానుడు జాలిబడి అయ్యా నీ ఆలు బిడ్డల కేలోటులేక పోషించి మీ కొప్పగింతునని చెప్పెను. బ్రాహ్మణుడు సంతోషించి భార్యబిడ్డల విడచిపోయెను. తొండమానుడు బ్రాహ్మణుని భార్యాబిడ్డలకు ప్రత్యేకమైన మందిరమేర్పాటుచేసి వారికి భోజన వస్త్ర సామానులందుంచి ఆ మందిరములోని కెవ్వరు పోరాదని ఆజ్ఞచేసి బటుల కాపుంచెను. కొన్నాళ్ళకు బ్రాహ్మణునిభార్య ప్రసవదినము లొచ్చె కాని తొండమానుడు రాజ్యకార్యములలోపడి వారి విషయమే మరచెను. వారి కెటుపోవుటకు వీలులేక మందిరమునకు తాళములు వేసియుండుటచే ఆమె, కొడుకు ఉపవాసాలతో తిండిలేక కృషించి ప్రసవించి ఆకలిమంటచే బిడ్డలు బ్రాహ్మణపత్ని మందిరంలోనే మరణించిరి. కాని ఆ సంగతి రాజుకు తెలియదాయె. నంత కాశికిపోయిన బ్రాహ్మణుడువచ్చి తొండమానుని చూచి అయ్యా నా బార్యాబిడ్డలు క్షేమముగాయున్నారా యన రాజు గుండెలవిసి అప్పుడు జ్ఞప్తికివచ్చి మీరు వెళ్ళి స్నానసంధ్యలు దీర్చుకొని రమ్మని బంపి పోయి తలుపులు తెరచిచూడ వారి కళేబరములు మాత్రము కనుపించెను. ఆ తొండమానుని దుఃఖమునకు అంతులేదు.

బ్రాహ్మణహత్యకు పాల్పడితిని నా బ్రాహ్మణునకేమి చెపుదున్
యేమిసేయుదును యీ పాపము నా కెన్ని జన్మలకు దీరున్
అని దుఃఖింపగ నంత బ్రాహ్మనుం డిరుదెంచి నిలువ జూచి.
నిలుపున నీరై జెప్పె నీ విధిన్ బల్‌యోచనలన్ జేసి

గీ॥ అయ్య నీ బార్యబిడ్డలు నెల్లవారు
వేంకటాద్రికి పోజూచి వారివెంట
స్వామి దర్శింపబో..రి మీరు వంట
చేసుకొని విశ్రమింపుడు వచ్చుదనుక

వ॥ అని జెప్పి కుమారుని వెంటబెట్టుకొని వెంటనే వేంకటాచలముచేరి శ్రీ వేంకటేశ్వరుని పాదములబడి వెక్కి వెక్కి ఏడ్చుచుండ స్వామిజూచి ఎందుకిట్లు పరితపించుచుంటివని యడుగ.

గీ॥ భోరుమని ఏడ్చి చెప్పగ నోరురాక
పొరలి దుఃఖించు రాజును స్వామిజూచి
దివ్యదృష్టిని సర్వము దెలుసుకొనియు
తొండమానుని కీపాపమంటకున్నె

వ॥ ఎంతపని జేసితివి నిష్కారణముగా బ్రాహ్మణహత్యా పాతకము గట్టుకొంటివే. నీవు నాకు పరమభక్తుడవు. భక్తుల కాపదలు గల్గిన నేను సహింపలేను, గాన ఆ శవములను తెప్పింపుము, సజీవులుగాజేసి నీకు పాపమురాకుండ జేతునన, తొండమాను డానందించి వెంటనే తన కుమారుని బంపి వారి కళేబరములను తెప్పింప భగవానుడు ఆ శవములపై అస్త్ర తీర్థమును ప్రోక్షించగా బ్రాహ్మణుని భార్యాబిడ్డలు నిద్రనుండి లేచినట్లు లేచిరి. అందరు సంతోషించిరి. తొండమానుడు వారిని బ్రాహ్మణుని కొప్పగించెను బ్రాహ్మణస్త్రీ శిశుహత్యా పాపముల దొలగించి కరుణించిన దయామయుని నిట్లు స్తుతించెను.

(దశావతార వర్ణనము)

సోమకుని ద్రుంచి జలధిని శ్రుతులదెచ్చి
అజున కొసగిన మత్స్య రూపావతార
సుధను సాధింప మందర కుధరమునకు
నలకుదురుపైతి కూర్మ రూపావతార
ధరనుగావ హిరణ్యాక్షు దర్పమడచి
నట్టిదేవ వరాహ రూపావతార
నా హిరణ్యకశ్యపు గూల్చి నర్భకునకు
నార్తిబాపిన నారసింహావతార
ప్రబలి పాదత్రయంబున బలినడంచి
అమరనాథు బ్రోచిన రామావతార

ఇరువదొకిమారు ధరజుట్టి నరపతులను
హతమొనర్చిన పరశురామావతార
శంకరార్పితు రావణ పొంకమడచి
అవని నేలినస్వామి రామావతార
బాలగోపాల సమరాన పార్థునకును
జ్ఞానబోధనుజేసిన కృష్ణావతార
పశుబలులు మాన్పి జ్ఞానంబు ప్రజలకిడిన
జీవకారుణ్య రూప బుద్ధావతార
ధర్మసంస్థాప నార్థంబు ధరణియందు
నవతరించెడి కలికి రూపావతార
దివ్యమంగళ విగ్రహా దీనబంధు
వేదచోదిత వేదజ్ఞ వేదరూప
నిండు కొల్వున ద్రౌపది నిన్ను వేడ
మానరక్షణ చేసిన మహిత కీర్తి
నెంతపుణ్యంబు జేసిరో నీజనాళి
యిలను వెలసితి శ్రీకర ఇందిరేశ
విజయతే శ్రీశకల్యాణ వేంకటేశ
శ్రీధరా నిన్ను సేవింతు సిరునొసంగి
సతతము మముబ్రోవు మాస్వామి చక్రపాణి
వందనము నీకు జగదీశ భక్తపోష
వందనము నీకు లక్ష్మీశ పావనాశ
విజయతే శ్రీశ తిరుమల వేంకటేశ

వ॥ అని తొండమానుడు పులకిత శరీరుడై నిర్మల భక్తితో వేంకటేశ్వరుని స్మరించి వర్ణించుచూ ఆనందబాష్పముల రాల్చుచుండ స్వామిచూచి ఆతని భక్తికి సంతసించి యిట్లనెను.

(వేంకటేశ్వరుడు శిలారూపము పొందుట)

వ॥ రాజేంద్రా కలియుగమున మానవులు యీ విధముగనే తెలిసియూ తెలియక మహాపాపములుచేసి వానిని తొలగించుమని క్షణక్షణము నావద్దకువచ్చి ప్రార్థించి నన్ను బాధించుచుందురు, నేను వారిని రక్షించి వారిపనులు పూర్తి చేయనిచో కఠినాత్ముడని నన్ను నిందింతురు. నేను రాత్రిపగళ్లు యీ బాధ పడజాలను. గాన నేటినుండి యీ కలియుగాంతము వరకు మౌనము వహించి నెవ్వరితో మాటలాడక శిలారూపునివలె నుందును. నా అంతరంగ భక్తులతో మాత్రమే మాటలాడుదును,

వ॥ అని చెప్పి శ్రీనివాసమూర్తి ఆనందనిలయముజేరి పద్మావతీ దేవిని ఎకమందుంచుకొని నాల్గు హస్తములతో శంఖుచక్రములు లేకుండా శిలాప్రతియై తన మౌనము వహించెను.

వ॥ అంత బ్రహ్మాదిదేవతలు శ్రీనివాసమూర్తి భక్తజనరక్షణకై నింత త్యాగముచేసిన స్వామిని నెల్లవారు నుతించిరి

శ్లో॥ కశ్యపాత్రి భరద్వాజ విశ్వామిత్రశ్య గౌతమః
వశిష్ఠో జమదగ్నిచ్ఛ్య సప్తతే రుషియస్తథాః

వ॥ అంత సప్తరుషులు దేవమునులు నారాదాది తుంబురులు భక్తితో శ్రీహరి స్తోత్రముల జేసిరి.

శా॥ స్వామీపుష్కరిణీ సమీపమున స్వామీ వరాహస్వామికిన్
సామిప్యంబున నిల్చి స్వర్ణమయమౌ సప్తద్వారప్రాకారముల్
సేవాభక్తి జనాళ్ళ్య వేదపఠనా సద్ఘంటికా నాదముల్
శోభాయమ్మగు లక్ష్మి భూసతులకున్ జేజేల్వేంకటేశ ప్రభో.

గీ॥ అని నుతింప పద్మావతి శ్రీనివాసు
రూపమున్గని భోరున కొప్పినేడ్చె

పతివిహీనను జేసి నెడబాయనెట్లు
దిక్కుమాలిగ జీవింతు దీనబంధూ.

పాట - శివరంజని

పతిలేని సతికి గతియేమున్నది పతితపావన ప్రపంచమునా
బ్రతికిసార్థకం బేమున్నది నీ పదములె నమ్మిన దాసికిలన్ ॥ప॥
నా అసువులు మీ పాదములచెంత నర్పణముజేసి మీలోగలసెద
నన్ను కరుణించి సెలవిండు స్వామి కన్నులార నొకసారైనజూతు ॥ప॥

వ॥ అని కన్నీరు కాల్వలై బార శిలారూపుడైన స్వామి పాదములపైబడి వెక్కెడ్చు పద్మావతీదేవినిన్ గని కరిగిపోయి కరుణించి దయామయుండగు వాసుడు నిజస్వరూపుడై దర్శనమిచ్చి అభయహస్తమున పద్మావతీదేవి కు దీసికొని చేత శిరము నిమురుచు నిట్లనెను.

గీ॥ ప్రాణసమమైన దేవినిన్ బాయగలన
లోకకల్యాణమునకెట్టి త్యాగమైన
జేసి భరియింతు పాలింతు జలజగంధి
వంతనందకు నీమదిన్ చింతదీర్తు.

గీ॥ మూలరూపము నావక్షమునను నుంచి
తిరుచానూరున నిల్పు నీమూర్తిపూజ
లింక భక్తులు అలిమేలుమంగ పట్న
మనెడు పేరున నిత్యకళ్యాణములతో

మంజరులు

సకల జనులు కళ్యాణమంటపాల్ సర్వవసతులతోజేరీ
నిఖిల లోకకల్యాణములతోడ నివశింత్రు భక్తులుర్వీ
తిరుమల యందున తిరుచానూరున జరుగు కల్యాణమెప్పుడు
అరుదెంచి నేను నిద్రజేసి నీ శేషాద్రికన్ బోదునెప్పుడు

మంజరి

అని జెప్పి శ్రీనివాసుడు శిలరూపునను తన రూపున నిలచె
మునిజన దేవత మొదలౌ భక్తులు కొనియాడి పూజలుజేసె
కలియుగ వైకుంఠ నిలయుడై వెలసె వేంకటేశ్వరుడు నాపై
నెల్ల పాపముల దొలగించి భక్తులెల్ల తరింపగ గిరిపై,

వ॥ పద్మావతీదేవికి సర్వము నెరుగజెప్పి శ్రీనివాసమూర్తి ఆనంద నిలయమునందుజేరి పద్మావతీదేవిని తన వక్షమందుంచుకొని నాల్గు హస్తములతో శంఖచక్రములు లేకుండా శిలాప్రతిమయై మౌనము వహించెను.

వ॥ తొండమానుడు తన రాజ్యముమీద ఆశ వదలి తన కుమారునకు పట్టాభిషేకముజేసి, తాను సర్వత్యాగ పరిత్యాగిగా విరాగియై వేంకటాచలమునచేరి స్వామికి ప్రీతియైన తులసీదలములతో అనేక పుష్పహారములతో అలంకరింప అర్చింపవచ్చి శ్రీ వేంకటేశ్వరుడైన శ్రీనివాసునిజూచి ఇట్లు పశ్చాత్తాపముతో బాధపడుచూ స్వామిని వేడుకొనెను.

పాట - రూపకం

వేంకటరమణా నాతగు సంకటముల బాపనెంచి
పంకజ ముఖులైన సతుల జంకక విడచియునాకై ॥వేం॥
బ్రహ్మహత్య పాపమునకు బాధపడుచునుండ నాదు
పాపంబుల బాపి శిలారూపంబును నొందినావే ॥వేం॥

పాపుడ విటు జేసితినని తాపంబును జెందుచుంటి
పాపునితో మాటాడక మౌనమూన నెటుభరింతు
నాపుర సుఖ ధన బంధుల నీ భువి సర్వపరిత్యా
గంబున వ్యామోహ మిడచి గతి నీపదమని నమ్మితి ॥పా॥

గీ॥ తెలియనైతిని నీవింత త్యాగమూర్తి
వగుచు కలిలోక కల్యాణ వాంఛదీర్ప

ప్రాణసతులను నెడబాపి భక్తరక్ష
ణార్థమై శిలస్వరూపమునంది నావె.

గీ॥ వేగ దయయుంచి దర్శనమీగదయ్య
బాపముల బాపి కరుణ నీ పదముజేర్చి
తాపమును మాన్పి నాదు శాపంబు దీర్చు
భక్తమందార భవదూర వేంకటేశా.

గీ॥ ఇంక భరియింపజాలనో వేంకటేశ
సంకటంబుల దొలగించి వేంకటేశ
భక్తరక్షణ సేయుమో వేంకటేశ
భక్తమందార భవదూర వేంకటేశ.

గీ॥ వక్కపరి కోపమునుదీర వేంకటేశ
చక్రమున ద్రుంచి నాశిరము వేంకటేశ
చక్కనగు మోక్షమీవయ్య వేంకటేశ
భక్తమందార భవదూర వేంకటేశ

గీ॥ నింకిపుట్టుక జావులన్ వేంకటేశ
చిక్కనీయకు మాయలన్ వేంకటేశ
నిక్కముగి నీదు దాసుడన్ వేంకటేశ
భక్తమందార భవదూర వేంకటేశా.

మంజరులు

అని వేదనపడు తొండమానుపై శ్రీనివాసు కరుణించి
తన పదములపై బడిన రాజులో ఘనమైన జ్యోతిలేచి
తనలో జేరెను శ్రీనివాసుడుగ ఘనపుణ్యమోక్షమిచ్చే
జయజయ ధ్వనులుగ మింట మ్రోగించె సురలు సుమవృష్టిగురిపించె.

వ॥ శ్రీ వెంకటేశ్వరస్వామి కనుగ్రహముగల్గి తొండమానునకు శాశ్వత మోక్షసుఖమొసంగి జన్మరాహిత్య మొనర్చెను.

గీ॥ అపుడు నారదముని సంతసంబుతోడ
వీణమీటుచు స్వామి కీర్తనలబాడి
నృత్యగానము జేయుచు భక్తిపేడి
వేంకటేశ్వరు దర్శించె వేడుకలరా.

వ॥ దివ్యమంగళ విగ్రహుడైన వేంకటేశ్వరుడు నారదమునిగని చిరునవ్వునవ్వి నారదా.

మంజరులు

శాంతిబడెనసీ మానసములోని సర్వకోరికలు దీరగ
కాంత సురభోగమెల్లమానుకొని భక్తరక్షణకునోర్చి
నుంటి నిటుల నస్టూడ వచ్చితివ వంటివాడవె మేటీ
కంటికింపుగా కలహములనుంచీ వడ్డికాసులగాబెంచి
కొంటెవారి కాపదలు గల్పించి కుబేరు ఋణమును దీర్చన్
గట్టినుపాయముజేయ నా ఋణము కలియుగాంతమున దీరగ

వ॥ అనుచు నిష్టురములు బల్కు నిష్టదేవుచిజూచి స్వామీ నేను కలహ భోజనుడగాను లోకోపకారమునకే మీకు తోడుగా నిట్టి సలహాలిచ్చితి నంతేకాక సీవు నీ చిత్రనాటకమాడి యాడించు నీ మాయ లెవరికి తెలియును స్వామి.

సీ॥ కైలాగిరినెక్కి ఘనతగాంచె నటంచు
ఏడుకొండలపైకి నెక్కినావు
గంగాజటాజూట ఘనయశస్కుడటంచు
శ్రీనివాసుడవై వెలసినావు
వెల్లబూదిని నిలువెల్ల దాల్చెనటంచు
తిరుమణి న్నొసటిపై దిద్దినావు

వృషభరాజంబునెక్కి విస్తరిల్లెనటంచు
ఖగరాజుపై నెక్కగలిగినావు
ఫణిభూషణుండన్న ప్రతిభగాంచె నటంచు
ఫణిరాజు పాన్పుపై పండినావు
కాలకూట విషంబు గ్రోలజాలె నటంచు
దావానలంబట్టె ద్రావినావు
నీలకంఠుండని నియతిగల్గె నటంచు
నీలదేహుండవై నిల్చినావు
నగరాజుపైనెక్కి నాట్యమాడె నటంచు
అహిరాజుపై నాట్యమాడినావు
పత్నిద్వయంబులా బడయజాలె నటంచు
బహు పత్నులను నీవు బడసినావు
పంచముఖుండను ప్రఖ్యాతిగలదంచు
విశ్వరూపుండవై వెలసినావు
పంచాక్షరీమంత్ర వశవర్తితానంచు
అష్టాక్షరీమంత్ర మందినావు

తే॥ గీ॥ శివునికన్న నాధిక్యత జెందదలచి
ఇటుల నొనరింప జాలితివేమొకాని
భేదరహితంబు మీలోన బోధపడియె
వివిధ రీతుల యోచింప వేంకటేశా.

కం॥ హరతత్వము హరితత్వము
బరతత్వములనై వెలంగ ప్రస్ఫుటశక్తిన్
హరిహర రూపంబగునా
పరతత్వము గొల్తుభావ పరిపూర్ణతకున్.

శ్లో॥ కలికల్మష చిత్తానాం పాపద్రవ్యోప జీవినాం
విధిక్రియా విహీనానాం గతిర్గోవింద కీర్తనం.

వ॥ కలియుగమున మానవులు కడతేరుటకు శ్రీహరినామ సంకీర్తన వినా వేరే గతిలేదు గాన కలిమాయలోబడి తెరువుగానక నపాయమునబడి పరితపించు జీవుల కుపాయంబగు నీ నామస్మరణమే తరింపజేయుటకే ఈ యుపాయంబు బన్నితి స్వామీ నాతప్పులు క్షమింపుడని ఇట్లు స్తుతించెను.

( గునుగు సీసపద్యములు )

కృష్ణా మాధవ హృషీకేశ కేశవ జనార్ధన యదునందనా దామోదరా వరదా వికుంఠపతి విష్టరశ్రవ ఫణిరాజశయన ముచిత పుండరీకాక్ష శార్ఙ్గి శౌరి యధోక్షజ వనమాలి గదాగ్రజ మురదమనపీతాంబర జాగ్రదుదగ్ర జలగ్రహ గ్రహార్తి ఔరలిజగత్పతే పుషితరుపితతే పాహిపాహిమాం దీనమాపన్నరక్షకయంచు మొర లిడగ బిరాన చనుదెంచి నిర్వక్రచక్రధారను కిరికుృన మకరిని తల దునిమి కరిని దరిజేర్చిన కన్నతండ్రీ మమ్ము కావౌదరా వీనమురభపత్పదము నిజాశ్ర గాశీయుట విశంకట నిశాట కుష్కంటక పేటమిళిత విగ్రహ వర్మిక విశ్వజనపోష తిరుమల వేంకటేశా.

దయగలవాడవపు ధర్మరక్షకుడవు పరమశాంతుడవు శుభగుణుడవు సదా సద్గుణ పీఠవిచక్షుడవు సఘటనఘటనా పటుడవు నజాంతదారివి శ్రీసతీ ధవుడవు నినుబోలు జేజేలు గలరే ఆశ్రితులను దీనజనులను రక్షింతునని కంకణము ట్టు కొన్నవాడవట. యోహో మావంటివారి కుయ్యాలింపక సాదరాలింగిత శ్రీవిశాల కుంకుమ కల్పిత శుచకోక విశ్వజనపోష తిరుపతి వేంకటేశా.

నేడు నేడా నేను నీవాడనగుట నా కేడుగడయచూపు మిపుడిపుడా కాద నా యెన్నెన్నిజన్మముల నుండియో నాశితమునకును నీ పదయులకును లం యెయ్యె. నెక్కొని మ్రొక్కిమ్రొక్కి వేసారితి ,నిక నలచక మనచదలచితె జాగిదేలరా కరాంభుజ సంభవ కరశాఖాప్రవాళ గళికా ముహుర్ముహుర్ముక్తమా సముజ్వల దురుకమల సదృశాక్ష్య గంహ్వరఘటిత జనిత కలకల మురళికారో విశ్వజనపోష తిరుమల వేంకటేశా.

ఆపద వచ్చిన యప్పుడు నౌరులచేదొరికిన యప్పుడు గ్రహచారము చాల నప్పుడు విషవృశ్చికాహిపీడ పొరిలసియప్పుడు నాభిచారముల్ పొరయునప్పుడు అవనిరుజాపీడ లంటుకొని నప్పుడు ఘాతగ్రహంబుల భీతి తోచునప్పుడు నుద్ధ ధించు నిర్మలశ్రీణ స్వాతంత్రము త్వదీయ కృష్ణాఖ్యమంత్రము మంచితారుణ పింజాహా సూర్యదుహితృ కుటిలకేశోష్ఠ బంధూక విశ్వజనపోష తిరుమల వేంకటేశా.

శ్రీ వేంకటేశ్వరుని మనసార స్తుతించి నారదముని త్రిలోకముల కేగెను. శ్రీ వేంకటేశ్వరస్వామి వేంకటాచలము (తిరుపతి తిరుమల) యందు వెలసి నాటినుండి భక్తరక్షణ మొనర్చుచూ కలియుగమున యింటింట యిలవేల్పై నిలచెను. వెంకటేశ్వరస్వామి నివశించు పర్వతమునకు ఏడు పేర్లు గలవు. ఆపేర్లొచ్చుటకు కారణములు.

మంజరులు

ఆదిశేషరూపమున నుండుటచే ఆది శేషాచలమనుచూ
వేదములు గిరిని యిమిడియుండుటచే వేదాచలమని యనుచూ
గరుత్మంతుడు డీ భువిజేర్చుటచే గరుడాచలమనియంచూ
వృషాసురుడు మరణించి మోక్షమందుట వృషభాద్రి యనగబడుచూ
అంజనాదేవి తపసి హనుమగనె అంజనాద్రియని బిల్చా
ఆదిశేషు వాయువుదెచ్చిన గిరి యానందాద్రిగనెంచూ
సంకట బాపము బోగొట్టుగాన వేంకటాచల మటంచూ
సప్తగిరులేడు యొప్పుచుండుటచే సార్థక గిరులుగ నెంచూ.

శ్లో॥ సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే
తస్మాద్వేంకట శైలోయం లోక విఖ్యాత కీర్తిమాన్.

( తీర్థ మహిమలు )

వేంకటాచల పర్వతము మూడు ఆమడల వెడల్పు, ముప్పదామడల పొడవుగల్గి ఆదిశేషుని రూపమొప్పుచుండు ఈ పర్వతమునందనేక దివ్య తీర్థము

లున్నవి ఆ తీర్థములన్నిటిలో పుష్కరణి చాలా ముఖ్యమైనది. అందలి నీరు మధురామృతముగానుండు ఆ నీరు తాకినంతనే సకల పాపములు నశింతును.

( స్వామి పుష్కరణి తీర్థము )

ఒకప్పుడు చంద్రవంశపురాజైన నందునకు ధర్మగుప్తుడను కొమారుడు గల్గెను. కొడుకు పెద్దవాడు కాగానే నందుడు వానికి రాజ్యమిచ్చి తపస్సునకు బోయెను. ఒకనాడు ధర్మగుప్తుడు వేటాడబోయి వేటాడి అలసి చీకటగుటచే ఒకచెట్టునెక్కి కూర్చుండెను. ఆ సమయమున నొక సింహం యెలుగుబంటిని తరుముకొనివచ్చె ఎలుగు భయపడి రాజున్న చెట్టెక్కెను. రాజు భయపడ ఎల్గొడ్డు ధైర్యము చెప్పెను. రాజా నీవు అర్ధరాత్రివరకు నా తొడపై నిద్రింపుము తరువాత నేను నీ తొడపై నిద్రింతునని నిద్రింపజేసెను. సింహము రాజును క్రిందికి తోయుము భుజించిపోదునన. ఎలుగుబంటి వప్పలేదు. తర్వాత రాజు నిద్రలేచెను. యెలుగు రాజుతొడపై నిద్రింప సింహము రాజుతో రాజా యెలుగుబంటిని క్రిందతోయుము దాని తిని నేబోదు నీకు భయముండదన రాజు సింహముమాట నమ్మి యెల్గును తొడనుండి క్రిందికి త్రోసెను. దైవానుగ్రహమున ఎలుగు చెట్టుకొమ్మలు పట్టుకొని క్రిందపడకుండా నిల్చి రాజుతో ఓయీ రాజా ఎంత విశ్వాసహీనుడవు అటువంటివాని భూదేవి సహితము భరింపలేదు. నేను నిజముగా ఎలుగును గాను భృగువంశమున బుట్టిన బ్రాహ్మణుడను కామరూపము ధరించి తిరుగుచున్నాను. నీవు విశ్వాసహీనుడు గాన పిచ్చివాడవై పోదువుగాక అని శపించెను. ధర్మగుప్తుడు పిచ్చివాడై దేశదేశములు దిరుగుచుండెను. మంత్రులు వానిజాడ తెలుసుకొని తపసు చేయుచున్న వాని తండ్రికి చెప్పిరి. అంత నందుడు కొడుకు పిచ్చికి దుఃఖించి జైమినీమహాముని వద్దకేగి తన కుమారుని విధముజెప్ప జైమినిముని యోగదృష్టితో సర్వము తెలుసుకొని రాజా నీ కుమారుని వేంకటాచలముననున్న స్వామిపుష్కరణిలో స్నానమాడించిన వాని పిచ్చిపోవునన. నందుడు కుమారుని పిలుచుకొని వెంకటాద్రినిచేరి ధర్మగుప్తుని స్వామిపుష్కరణిలో స్నానమాడించెను. స్నానమాడగనే వాని పిచ్చితనము పోయెను. ధర్మగుప్తుడారోగ్యవంతుడై స్వామిని భక్తితో సేవించి అగ్రహారములు స్వామికర్పించి ఎన్నో కానుకలిచ్చి ధన్యుడయ్యెను. గాని ఈ

స్వామిపుష్కరిణిలో స్నానమాడిన సమస్తపాపములు తొలగి ఆయురారోగ్య భాగ్య ఐశ్వర్యములు కలుగును

( కుమారధార తీర్థము )

ఒకప్పుడు బ్రాహ్మణోత్తము డొకడు వేంకటాచలమున తపస్సుచేసుకొనుచుండి నతడు శతవృద్ధుడయ్యెను. ఆతనికి కౌండిల్యుడను శిష్యుడుండెను. బ్రాహ్మణుడు పరమ నిష్టతో తపము సాగించెను. ఒకనాడు వృద్ధుడు కందమూలములను తెచ్చుటకై బయలుదేరి అందందుతిర్గి వచ్చిన మార్గము తప్పిపోయి బడలికతో శిష్యుని బిలుచుచూ తిరుగుచుండె గాని శిష్యుడు రాలేదు. ఎండవేడికి నాలుక ఎండినది తన ఆశ్రమము దారి తప్పెను. అప్పుడు దయామయుండగు వేంకటేశ్వరుడు చక్కని కుమార రూపములో ఆ ముసలవద్దచేరి అయ్యా ఇక్కడెవ్వరునూలేరు. ఏల అరచుచున్నావు. నీ శరీరము ముడతలుపడి చూపులేని వృద్ధుడవైనావే ఇంకా జీవించి ఏమిచేయనెంచితివన. బ్రాహ్మణుడు కుమార రూపముననున్న స్వామితో అయ్యా నే బ్రతుకు కొరకాశించలేదు. ఇంకా నే దేవతా రుణము దీర్చుకోలేదు. ఆరుణం తీర్చుకోకుండా చనిపోవుట వ్యర్థమని జీవింపదలచితినసెను. వేంకటేశ్వరుడు నవ్వి తన చేతిలో ముసలివాని చెయ్యి పట్టుకొని కుమారతీర్థమును జూపి స్నానము చేయమన. ఆ ముసలి కుమార తీర్థమున మునిగిలేచినంతనే ముసలి పదునారు వత్సరముల యవ్వనవంతుడయ్యెను. శ్రీ వేంకటేశ్వరుడు నా యువకునకు కర్మానుష్టానమునకు కావలసిన సౌకర్యములనిచ్చి పోయెను. ముసలివారిని వయసువారిగా చేయు మహిమ గలుగుటచే ఆ తీర్థమునకు కుమారతీర్థమని పేరుగల్గినది.

( ఫల్గుణీ తీర్థము )

పూర్వము సనకసనందనాదులు సప్తరుషులు యీ తీర్థమున నివసించిరి. యీ తీర్థమున అరుంధతి మహాలక్ష్మినిగూర్చి తపస్సుజేయ ఆమె తపస్సుకుమెచ్చి లక్ష్మీదేవి ప్రత్యక్షమైనది. ఆ దినం ఫాల్గుణ శుక్లపూర్ణిమరోజు ఫల్గుణీనక్షత్రమున్నప్పుడు ఈ తీర్థమున స్నానమొనర్చినవారికి సమస్త కోరికలు యిత్తునని లక్ష్మీదేవి అనుగ్రహించినది ఆ తీర్థసమీపములో అగస్త్యమహాముని పూలతోట

నిర్మించి ఆ తోటలోని పూలతో శ్రీ వేంకటేశ్వరునకు నిత్యము పూజింపు చుండును. అతీర్థమతి మహిమగలది.

( సనకసనందన తీర్థము )

మహాయోగులు యోగసిద్ధికై నీ తీర్థమున మునుగుదురు. ఈ తీర్థము పాపవినాశనమునకొక మైలుదూరమున్నది. సిద్ధులందరు ఊతీర్థమును నాశ్రయించియుందురు. మార్గశిర శుద్ధత్రయోదశి దినమున ఈ సనకసనందనతీర్థములో స్నానమాడిన భక్తితో వేంకటేశ్వరస్వామి అష్టాక్షరిజపించిన మంత్రసిద్ధిగలిగి మోక్షము లభించును, ఇచ్చటనేకమునులు తపస్సుజేసి సిద్ధిబొందిరి.

( జాబాలి తీర్థం )

శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయమునకు వాయవ్యముగా జాబాలి తీర్థమున్నది. ఆ తీర్థమున జాబాలిముని తపస్సు చేయుటవలన అతీర్థానికాపేరు వచ్చింది పూర్వం కావేరినదీతీరమున ఒక బ్రాహ్మణుడు కాపురం చేయుచుండ అతని నివాసమునకు సమీపంలో చాలామంది బ్రహ్మహత్యాది పాపులు నివసించుచుండిరి. బ్రాహ్మణుడు మంచివాడైనను ఆ మహాపాపుల సంసర్గమువలన దుర్మార్గుడై దురాచారుడయ్యెను. కొన్నాళ్ళకతనికి పిశాచముబట్టి దేశదేశములు త్రిప్పుచుండెను. ఆ పిశాచి బ్రాహ్మణునకనేకచోట్లత్రిప్పి వేంకటాచలమునకు తీసుకొనివచ్చినది. పిశాచిబట్టిన బ్రాహ్మణుడు జాబాలితీర్థములో మున్గెను పవిత్ర తీర్థమున మునిగి లేచినంతనే పిశాచము వదలిపోయి పవిత్రుడయ్యెను. అప్పుడు బ్రాహ్మణునకు జ్ఞానముకలిగి కావేరినుండి నేనిక్కడికెట్లు వచ్చితినాయని యోచించి జాబాలిమునికి నమస్కరించి అడుగ జాబాలి దివ్యదృష్టినంతయు నెరింగి అతనికి పిశాచ వృత్తాంతమంతయు చెప్పి ఆ తీర్థమహిమ అతనికి బోధించి బంపెను.

( తుంబుర తీర్థము )

పూర్వము తుంబురుడను గంధర్వుడు మాఘమాసమున నెలదినములాతీర్థములో స్నానమాడి శ్రీవేంకటేశ్వరుని దర్శింప భార్యతోగలసివచ్చెను.

తుంబురుడు తన భార్యతో నీవు ప్రతిదినము నాకంటె ముందుగాలేచి తీర్థమున స్నానమాడి నేదేవతాపూజ జేసికొనుటకు ఆవుపేడతో పూజాస్థలము శుద్ధిచేసి ముగ్గులుబెట్టి దీపారాధన గావించి శుచిగా సమస్త పాకము స్వామి నివేదనకు సిద్ధంచేసి నాతోపాటు స్వామి కైంకర్యంలో పాల్గొని హరినామస్మరణ చేస్తూ నిష్టతో నుండుమని చెప్ప భార్యకోపగించి భర్తనిట్లనెను. మాఘమాసం చాలా చలిగానుండును. ఈ దినములలో చన్నీళ్ళ స్నానముచేసిన రొంపబట్టి రోగము వచ్చును గాన నావల్లగాదనెను తుంబురునకంతులేని కోపమువచ్చి ఓసీ భర్తమాట కెదురు చెప్పితివిగాన ఈ కొండపైనున్న ఘోణతీర్థము సమీపమున నున్న రావిచెట్టు తొర్రలో కప్పవై పడియుండుమని శపించెను. శాపము విని భయపడి భర్తపాదాలపైబడి తన తప్పు క్షమించి శాపము పోగొట్టుమన తుంబురుడు దయగలిగి ఇట్లనెను. నీవు కప్పరూపములో నున్నప్పుడు అగస్త్య మహాముని ఆ ఘోణ తీర్థమునకు వచ్చి అందు మునిగి శిష్యులకాఘోణతీర్థ మహిమజెప్ప నీవు విని శాపవిముక్తి నందగలవనె తుంబురు భార్య కప్పయై కొన్నాళ్ళకు అగస్త్యముని వలన శాపవిమోచనమైనది. తుంబురుడు నివసించినదే తుంబుర తీర్థము.

( ఆకాశ గంగ )

పూర్వము గోదావరితీరములో నొక అగ్రహారమందొక బ్రాహ్మణు డుండెను. అతడు వేదములు చదివినవాడు గొప్ప జ్ఞాని సతత మతిది పూజ భక్తితో చేయుచు భూతదయకలవాడు నిరతాగ్నిహోత్రు డతనిపేరు కేశవభట్టు ఒకనాడొక బ్రాహ్మణుడొచ్చెను. అతడుకూడా వేదములు చదివిన జ్ఞాని. ఆదినం కేశవభట్టు తండ్రికి తద్దినము అందుచేత వచ్చిన బ్రాహ్మణునే బ్రాహ్మణార్థమునకు నియమించి శ్రార్థము పూర్తిగావించెను తరువాత కేశవభట్టుకు వికృతంగా గాడిద రూపము వచ్చెను. బ్రాహ్మణుడు దిగులుపడి సువర్ణముఖినదికేగి అచట అగస్త్య ఆశ్రమంచేరి నమస్కరించి గాడిదరూపము పోవుమార్గము దెల్పుమని ప్రార్థింప అగస్త్యుడు యోగదృష్టినిజూచి నీ కర్మవచ్చుటకు కారణము మీ తండ్రి శ్రార్థము నాడు సంతానములేని వాని బ్రాహ్మణార్థముగా నియమించితివి గాన నీకీ గాడిద

ముఖము కలిగినది. నీవు శ్రీ వేంకటేశ్వరుని క్షేత్రమున పవిత్రమైన ఆకాశ గంగలో మునిగిన నీ వికృతరూపము బోవునన. వేంకటాచలముజేరి ఆకాశ గంగలో మునిగిన వెంటనే తన రూపము వచ్చెను.

( పాపనాశ తీర్థము )

పూర్వము భద్రమతియను బ్రాహ్మణుడు అతడు వేదములెరింగినవాడు. అతనికి ఆరుగురు భార్యలు. ఆ భార్యలందరికి సంతానము కలిగెను. ఇంటిలో ఎక్కడచూచినా పిల్లల గుంపుతో నిండిపోయెను. అతనికి వచ్చు ఆదాయము సంసారమునకు చాలక దరిద్ర బాధతో విచారించుచుండెను. బ్రాహ్మణుని భార్యలలో యశోవతియను కాంత పతి విచారమునుచూచి ఇట్లనెను. నాథా అన్ని దానములలో భూదానము చేయువారికి మహదైశ్వర్యములు లభించు గాన వెంకటాచలమునగల పాపనాశ తీర్థములో స్నానమొనర్చి భూదానముచేసిన వారికి సమస్త భోగములు గలుగును. ఇహపరసుఖములు గలుగును. సకలపాపములు హరించును. అని పూర్వం నారదముని మాతండ్రికి చెప్పగా విన్నాను అట్లుచేయుడన. బ్రాహ్మణుడు భార్యమాటలు విని వెంటనే సమీపముననున్న ఆగ్రహారమునకు బోయి ఒక గృహస్తునివలన ఐదు చేతులు కొలతగల భూమిని తాను దానము పొంది అక్కడనుండి వేంకటాచలముజేరి పాపనాశ తీర్థమున స్నానమాడి స్వామిని సేవించి తాను దానముగా సంపాదించిన ఐదు చేతుల పరిమితిగల భూమిని నొక బ్రాహ్మణునకు దానమిచ్చెను. పాపనాశమున చేసిన భూదానమునకు భగవంతుడు ప్రత్యక్షమై సకలమైన భాగ్యములు ప్రసాదించెను.

( చక్రతీర్థము )

పద్మనాభుడను నొక భక్తుడు సంసార సౌఖ్యముల విడచి వేంకటాచలమున నొకతీర్థమువద్ద పర్ణశాల వేసికొని తపస్సు చేస్తున్నాడు. అతడు కొన్నాళ్ళు కందమూలములు తిని, కొన్నాళ్ళు ఆకులు తిని, కొన్నాళ్ళు నీళ్లు త్రాగి, కొన్నాళ్ళకు గాలినే పీల్చికొని తపస్సు చేసె. అతని భక్తికి మెచ్చి వేంకటేశ్వరస్వామి ప్రత్యక్షమై నీకేమి కావలెనో కోరుకొనుమన.

ఆమాటవిని భక్తుడు స్వామి నాకేకోరికలుతేవు బ్రతికినన్నాళ్లు నిన్నుగూర్చి తపస్సు చేయునట్లనుగ్రహింపుమన. స్వామి అట్లేయనెను. పద్మనాభుడిలా తపస్సుచేయుచుండు వకనాదొక రాక్షసుడు ఆకలి బాధతో ఆ భక్తుని మ్రింగుటకు వచ్చెను. పద్మనాభుడు భయపడి భగవంతుని ప్రార్థించి రక్షింపుమనెను, దయామయుడగు భగవంతుడు ఆశ్రితోద్ధారుడైన వేంకటేశ్వరుడు తన భక్తుని మొరవిని వెంటనే చక్రమునంప రివ్వునవచ్చి ఆ రాక్షసుని కంఠము త్రుంచి భక్తుని రక్షించెను. ఆనాటినుండి అదే చక్రతీర్థమని పేరు గలిగెను.

## ( రామకృష్ణ తీర్థము )

పూర్వం రామకృష్ణుడను బ్రాహ్మణుడుండెను. అతడు బాల్యమునుంచి వేదాధ్యాయన మొనర్చి పెండ్లిమానుకొని సంసారబాధలు వదలి జన్మరాహిత్యము చేసుకొను మార్గమేమాయని యోచించుచుండ ఒకనాడు చిదానందుడను యోగి రామృష్ణుని యింటికివచ్చెను. రామకృష్ణుడాయోగిని చాలా భక్తిగా పూజించెను. యోగి సంతసించి నాయనా నీకేమి కావలయునని అడుగ. స్వామి సర్వసంగ పరిత్యాగిని నాకేమికావాలి ప్రపంచంతో నాకు పనిలేదు నాకెప్పటికిని జన్మ లేకుండా వుండుమార్గము బోధింపవలసినదని ప్రార్థించెను. తథాస్తు అని శ్రీవేంకటేశ్వరస్వామి అతనికి మోక్షమిచ్చెను. అతని జీవజ్యోతి స్వామిలో లీనమైనది. దేవతలు పూలవాన గురిపించిరి.

సీ॥ కళ్లు దెరచియున్న కలిమానవాధముల్
నిల్వన దోచుక బోవుసంచు
కదలి మాటాడిన వదలక వెన్నంటి
ఘోరబాపము లంట గడుదురంచు
స్థిరనిధుల్జూచిన నోర్వజాలరటంచు
స్థిరసిలారూపునన్ దిరయనెంచి
పట్టెనామాల్బెట్టి గుట్టురట్టుగాక
గుట్టపైననే నిల్చి చుట్టిజూచు

గీ॥ చందు నెల్లపుడు నిమీళితు నేత్రుడౌచు
మాయలీలా వినోదివై వైభవమున
నిత్యకళ్యాణ ఉత్సవౌ ద్భోగ్య ఈశ
విశ్వజన భక్తరక్ష శ్రీవేంకటేశా.

సీ॥ ధగధగధగ కాంతి నెగడు విసీధిని
నవరత్న మణిజ్యోతులావరింప
ధణధణధణ ధ్వనుల్ ధరసప్త నగములన్
తిరుగాడు బస్సు మోటారుకార్లు
తళతళన్మెరసెడి జిలుగు వెలుగు పసిడి
సింహాసప్తద్వార శేషనగరి
వజ్రకవచహస్త వక్షస్థలంబునన్
శ్రీదేవి భూదేవి జెలువలాచ

గీ॥ కర్ణకుండల కనకాంబ కంకణాది
దివ్యమణిహార ఫణిభూష దీనపోష
తారమణిహార కనకాంబణార్తరక్ష
భక్తమందార భవహార వేంకటేశా.

( మంగళ హారతి )

శ్రీసతి భూసతి పద్మావతి నాధా మంగళం
సప్తాచల స్థిరనివాస శ్రీనివాస మంగళం
కలియుగ వైకుంఠవాస కామితార్థ మంగళం
జె వెంకటకృష్ణశర్మ దాసపోష మంగళం.

సమాప్తం.

---